17.2.1995 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి : 67, సంచిక : 7, విడిప్రతి : రు. 2.00 లు

Phone : 27354. Regd No. HN/L. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు

జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి



## దేశంలో పోటీల గందరగోళం - కాంగ్రెస్‌లో అభ్యర్థులు దొరకని అయోమయం!

# ఎన్నికలు వన్‌వే ట్రాఫికేనా?

మండల, జిల్లాపరిషత్ ఎన్నికల సంరంభం జిల్లాలో బొత్తుగా కన్పించడం లేదు. నామినేషన్లకు వ్యవధి మీరుతున్నా ఎన్నికల వేడి పుంజుకోవడం లేదు. సాధారణంగా అసెంబ్లీల ఎన్నికల కంటే స్థానిక సంస్థల ఎన్నికల పట్లనే జనంలో మోజు ఎక్కువగా ఉంటుంది. గ్రామ గ్రామంలో నాయకత్వ స్థిరీకరణకు సోపానాలు కదా ఈ ఎన్నికలు. అయితే ఒక వైపు మొన్నటి ఎలక్షన్‌లలో కాంగ్రెస్‌కు దిమ్మ తిరిగేలా తగిలిన దెబ్బ, ఇంకొక ప్రక్క స్థానిక ఎన్నికల చట్టంలోని మార్పుల వల్ల ఏర్పడిన గందరగోళ స్థితి, రిజర్వేషన్ల తారు మారు పరిస్థితులు ఈ ఎన్నికల పట్ల ఉత్సాహాన్ని నీరు గారుస్తున్నాయి.

రిజర్వేషన్ల విధానం మొత్తం అవకతవకల మయమే. ప్రభుత్వానికి ఈ విషయంలో సరైన అవగాహన లేదు. ఆఖరు నిముషం వరకు తమకు తోచిన రీతిలో తోచినన్ని ఉత్తర్వులు జారీ చేసి గందర గోళం సృష్టించారు. కాంగ్రెస్ పార్టీ, మరీ నీరసపడి, నిర్వీర్యమై పోవడంతో వారి ఆటలు చెల్లాయి కాని లేకుంటే పెద్ద ఆందోళన చెలరేగి వుండాలి.

అభ్యర్థుల విషయంలో కాంగ్రెస్ దివాలా కోరుతనం మరీ స్పష్టంగా వ్యక్తమౌతున్నది. చాలా నియోజక వర్గాలలో కాంగ్రెస్‌కు అభ్యర్థులు లేరు. టికెట్ అడిగేవారు

## జిల్లా కాంగ్రెస్ నాయకులు సిగ్గుపడాలి!

లేరు. పోటీ లేకుండా ధారాదత్తం చేస్తే పరువు పోతుందనే భయంతో ఎవరో గంతకు తగ్గ బొంతను వెతికి తేవడం తప్ప, గెలవాలనే పట్టుదలతో, గెలుస్తామనే నమ్మకంతో బలమైన అభ్యర్థులను వెతికి తేవాలనే ఆసక్తి, చొరవ ఏ కాంగ్రెస్ నాయకుడిలో కన్పించడం లేదు. సివి శేషారెడ్డి, కలికి యానాది రెడ్డి, ఆనం రామనారాయణ రెడ్డి వంటి కొందరు తప్ప తక్కిన వారు పట్టీ పట్టనట్లు వ్యవహరిస్తున్నారు. ఆత్మకూరు డాక్టర్ బి.సుందర రామిరెడ్డి వంటి నాయకులైతే పోటీ చేస్తామని ఉత్సాహంగా ముందుకు వచ్చే వారిని కూడా నిరుత్సాహ పరచి పంపుతున్నారట. రిజర్వుడు స్థానాలలో కాంగ్రెస్‌కు అభ్యర్థులు దొరకడం చివరి వరకు అనుమానమే! సిగ్గు పడాల్సిన దుర్గతి ఇది. నిన్నటి వరకు అధికారంలో వుండిన పార్టీ, నేడు రాజకీయ పక్షవాత రోగి వలె వతికల బడటం అవమాన కరం కాదా? తమకు పదవులుంటేనే పార్టీని, కార్యకర్తలను పట్టించుకొనే తత్వం, పదవులుంటేనే రాజకీయాలనే స్వార్థం కాంగ్రెస్ మాజీ ఎమ్మెల్యేలలో ప్రబలడం సిగ్గు చేటు విషయం కాదా? శాసన సభ ఎన్నికల్లో తమ గెలుపు కోసం శ్రమించిన

తరువ 7 పేజీలో

# విదేశీయుల్లో భయం- స్వదేశంలో అయోమయం!

షేర్ల ధరలు రోజు రోజుకీ పతనమై పోతున్నాయి. మార్చి మొదటి వారానికి ఈ పతనం మరీ జాస్తిగా వుండవచ్చు. రాజకీయ అస్థిరత దీనికి ఒక కారణం మాత్రమే. ఇతర ప్రభావాలు చాలా వున్నాయి. బదలా బదలా విధానం రద్దు చేసిన తర్వాత మార్కెట్‌లో లిక్విడిటీ స్థాయి తగ్గడం; పెట్టుబడి దారులు తరచూ లాభాల పై దృష్టి మళ్లించడం వంటి

**అసెంబ్లీ ఎన్నికల్లో కాంగ్రెస్ ఓడితే షేర్ల పతనాన్ని ఎవరూ ఆపలేరు; ఆర్థిక సంస్కరణలు అడుగంటుతాయి!**

కారణాలు ఇక్కడ గమనించాలి. విదేశీ సంస్థాగత పెట్టుబడి దారులు మార్కెట్‌ను మరీ జాస్తిగా ప్రభావితం చేస్తున్నారు. రాజకీయ అస్థిరత, ఆర్థిక సంస్కరణలు కొనసాగవేమోనన్న భయం వారిని పీడిస్తున్నాయి. మెక్సికో మార్కెట్ పతనం వారిని భూతం వలె వెన్నాడుతున్నది. అదే ఇక్కడ పునరావృత మౌతుందన్న జంకు దీనికి కారణం. కానీ ఈ భయం కేవలం వూహా జనితమైంది. ఇండియా మార్కెట్ దృఢమైనది. అంతర్జాతీయ స్థాయి వ్యాపార పత్రిక బిజినెస్ వీక్ తాజా సంచికలో అర్జెంటీనా, కెనడా, ఫ్రాన్స్, ఇటలీ, స్పెయిన్ దేశాలలో మెక్సికో తరహా ప్రమాదం వుందని అంచనా కట్టిందే తప్ప ఇండియాను ఆ జాబితాలో చేర్చలేదు.

భారతీయ మార్కెట్ దృఢమైనదే అయినప్పటికీ, దానిని శాస్త్రీయంగా ఆధునీకరించడంలో మనం వెనకబడి వుండడమే విదేశీ పెట్టుబడి దారుల భయ సందేహాలకు తావునిస్తున్నది. వ్యవహారాలలో పారదర్శకతా లోపం, అనుమానాలకు తావిచ్చే సెటిల్‌మెంట్ పద్ధతులు, ఇన్‌సైడర్ ట్రేడింగ్ అలవాటు, సందేహాస్పదమైన కంపెనీల నిర్వహణ, కొండంత కాగితాల కట్టల అవసరం వంటి కారణాలు విదేశీ పెట్టుబడి దారులను చీకాకు పెడుతున్నాయి. భారత దేశంలో ఆర్థిక సంస్కరణలు నిరంత రాయంగా అమలు జరుగుతాయన్న నమ్మకంతో వారు ఇక్కడకు వచ్చారు. కానీ ఇప్పుడా గ్యారంటీ కన్పించడం లేదు. రానున్న పార్లమెంట్ ఎన్నికల దృష్ట్యా ఈ సారి కేంద్ర బడ్జెట్‌లో ప్రజాకర్షణ పథకాలు ప్రకటించ వలసి వుంటుంది. ఓట్ల కోసం రూపొందించే పథకాలు సాధారణంగా అనుత్పాదక తరహాలోనే వుంటాయి. వాటికి ప్లానింగ్ నిధులలో అధిక భాగం కేటాయిస్తే లోటు బడ్జెట్ తప్పదు. ఉత్పాదక అభివృద్ధి కుంటు పడుతుంది. పరిశ్రమలు దెబ్బతింటాయి. 1990 నాటి పరిస్థితులు తిరిగి పునరా వృతమైనా ఆశ్చర్యం లేదు. వీటి ప్రభావం వల్ల విదేశీ పెట్టుబడి దారులు వెనుదిరిగి వెళ్తారు. మార్కెట్‌లో అనిశ్చిత స్థితి నెలకొంటుంది.

రేపు జరుగనున్న ఆరు రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికల్లో కనీసం రెండింటిలోనైనా కాంగ్రెస్ గెలిస్తే కేంద్రంలో పివి ప్రభుత్వం వూపిరి పీల్చుకుంటుంది. అది జరగకుంటే ప్రజాకర్షక పథకాల కోసం వత్తిడి పై బడ్జెట్ నిధుల తరలింపుతో పాటు రాజకీయ అనిశ్చితతో మార్కెట్ అస్థిరత ఏర్పడుతుంది.

అయితే కొన్ని పరిశ్రమలు, వాటికి సంబంధించిన కంపెనీలు మాత్రం ఖచ్చితమైన లాభాలు చూపించే అవకాశం వుంది. ఇటువంటి కంపెనీల ధరలు మే నెల ప్రాంతంలో బాగా పెరుగుతాయి. ఇన్వెస్టర్లు ఈ తరహా కంపెనీలను ఇప్పటి నుంచే వెతుక్కో గల్గితే లాభపడతారు.



# మార్కెట్ ఎంత పతనమైనా కొన్ని షేర్లు చలించవు!

## మౌలికంగా సుదృఢమైన కంపెనీల షేర్లు కొనండి!

షేర్ మార్కెట్ పతన దశలో వున్నప్పుడు మౌలికంగా సుదృఢమైన (ఫండమెంటలీ స్ట్రాంగ్) కంపెనీల షేర్లను ఎంచుకొని కొనడం అవసరం. సాధారణ షేర్ మార్కెట్ ఎంతగా పతనమైనా, బిఎస్ఇ ఇండెక్స్ మరింత దిగజారినా ఇటువంటి షేర్లు తమ కనిష్ట స్థాయి కంటె తగ్గడం జరగదు. వీటిలో పెట్టుబడి పెడితే మినిమం గ్యారంటీ వుంటుంది. ఫండమెంటల్‌గా దృఢంగా వుండే షేర్లను ఎంపిక చేసుకోవడానికి ఆయా కంపెనీల గురించి సమగ్రంగా అధ్యయనం చేయడం అవసరం. కంపెనీ నిర్వాహకుల సమర్థత, అవి ఉత్పత్తి చేసే వస్తువులు, ఆ వస్తువులకు మార్కెట్‌లో వుండే గిరాకీ, వాటి లాభదాయకత, పోటీ, కంపెనీ ఈక్విటీ స్థాయి, ఐపిఎస్, పిఇ మల్టిపుల్, రేషియో, గతంలో వారి లాభ శాతం, ఇప్పటి అంచనా తదితర అంశాలన్నీ అధ్యయనం చేయవలసి వుంటుంది. అటువంటి కంపెనీ షేర్లు మూడింటిని పాఠకుల సౌకర్యం కోసం దిగువ ఇస్తున్నాము.

### చెట్టినాడ్ సిమెంట్

తమిళనాడులోని చెట్టినాడ్ ప్రాంతంలో వున్న ఈ కంపెనీ మంచి లాభాలలో నడుస్తున్నది. వీరు ఉత్పత్తి చేసే సిమెంట్, ఫ్యాక్టరీకి చుట్టు ప్రక్కల 200 కిలో మీటర్ల పరిధిలోనే అమ్ముడై పోతున్నది. అందువల్ల వీరికి రవాణా ఖర్చులు తక్కువ; లాభదాయకత జాస్తి; నిర్వాహకులు సమర్థులు; ఈక్విటీ తక్కువ. అందువల్ల వచ్చే మార్చి ఆఖరు లెక్కల అంతానికి రు 70 ల ఐపిఎస్ వచ్చే అవకాశం వుంది. ఇంత ఐపిఎస్ వుంటే సాధారణంగా కంపెనీలు బోనస్ ప్రకటిస్తాయి. ఈ కంపెనీ షేరు ధర రు 650 లు వుంది. షేర్ మార్కెట్ పతనంతోపాటు ఇది తగ్గడం లేదు. మద్రాసు స్టాక్ ఎక్స్ఛేంజిలో ఈ షేరు పై ధరకు రు10 లు అదనపు రేటు పెట్టి అడిగినా కొనడానికి దొరకడం లేదు. బోనస్ ప్రకటిస్తే షేరు ధర రు. 1000 లకు పెరిగే అవకాశం వుంది. ఎంత లేదన్నా ఏప్రెల్ నాటికి రు. 700 లకు తగ్గదు. అందువల్ల కొనుగోలు దారులు దీని కోసం గట్టిగా ప్రయత్నించవచ్చు. మార్కెట్ ఎన్ని ఒడిదుడుకులకు లోనైనా పెట్టుబడికి నష్టం రావడం అనేది వుండదు.

### పాండ్యన్ గ్రాఫైట్స్

ఈ ఫ్యాక్టరీ కూడా తమిళనాడులోనే వుంది. వీరు ఇటీవల లిక్విడ్ కార్బన్ (బొగ్గు పొడి ద్రవం వంటిది) తయారు చేస్తున్నారు. ఈ ఉత్పత్తిని బ్యాటరీలు, ఆటోమొబైల్స్, పంపులు, కంప్రెసర్సు, తదితరాలకు వాడుతారు. మార్కెట్‌లో వీరికి పెద్దగా పోటీ లేదు. 99 శాతం ప్యూరిటీతో కార్బన్ గ్రాఫైట్ తయారు చేసే

**ఫండమెంటల్‌గా దృఢమైన షేర్లు అనిశ్చిత స్థితిలోనూ లాభాలు పంచుతాయి; వాటిని వెతికి పట్టడమే ఇప్పటి మన కర్తవ్యం!**

పరిశ్రమలు దేశంలో చాలా కొద్ది మాత్రమే వున్నాయి. ఉత్పత్తి విక్రయాల మీద 30 నుంచి 35 శాతం లాభాలు ఆర్జిస్తున్నారు. పరిశ్రమలలో ఇంత లాభం అరుదు.

వీరి షేరు ధర రు. 126 లుగా వుంది. ఐపిఎస్ రు 12 లు; ఈ షేర్ల పై పెట్టుబడి పెడితే మే నెల చివరి నాటికి 40 నుంచి 60 శాతం 8 పేజీలో

# అప్రజాస్వామికం

స్థానిక సంస్థల ఎన్నికల నిర్వహణలో రాష్ట్ర ప్రభుత్వం అవలంబిస్తున్న వైఖరి చాలా అభ్యంతరకరంగా అప్రజాస్వామికంగా వుంది. ఎన్నికల సక్రమ నిర్వహణ కోసం టిఎన్ శేషన్ అంత రచ్చ చేస్తున్నా, చైతన్యం తెస్తున్నా పాలకుల్లో కనీసపాటి ప్రజాస్వామ్య స్ఫూర్తి లోపిస్తున్నదంటే మన రాజకీయ వాదుల బుద్ధి కుక్కతోక వంటిదేనని భావించాలి.

పాలకులకు మొదటి నుంచీ స్థానిక సంస్థలంటే చిన్నచూపు. విధిలేని పరిస్థితులలో తప్ప ఎవ్వరూ వాటి నిర్వహణను తల పెట్టరు. ఈ నిరాసక్తత వల్లనే ఎప్పుడో మూడేళ్ల క్రితం జరగవలసిన ఎన్నికలను కాంగ్రెస్ నాయకులు ఇంత దూరం నెట్టుకుంటూ వచ్చారు. ఎన్‌టి రామారావుగారికి నెట్టడానికి అవకాశం చిక్కలేదు. కేంద్ర చట్టం రూపొందడం వల్ల ఎన్నికలు జరపకుంటే రేపు మార్చి తర్వాత నిధులు నిల్పివేస్తామని ప్రధాని పదే పదే భయపెట్టడం వల్ల బలవంతపు బ్రాహ్మణార్థంగా నిర్వహించబోతున్నారు. ఎప్పుడు స్థానిక సంస్థల ఎన్నికలు జరిపించినా, అప్పుడల్లా అధికారంలో వుండే నాయకులు తమ తెలివినంతా వాటిపై రుద్ది రూపురేఖలు మార్చి వేయడం పెద్ద జాఢ్యం. రామారావు గారూ ఇందుకు మినహాయింపు కాలేక పోయారు. అందువల్లే స్పెషల్ ఆర్డినెన్స్ ద్వారా మండల వార్డు స్థాయినుంచే పార్టీ టిక్కెట్ల విధానం ప్రవేశ పెట్టారు. అందులో ఆయన స్వార్థం వుంది. రెండు నెలల క్రితం జరిగిన అసెంబ్లీ ఎన్నికల్లో తన పార్టీకి అఖండ విజయం చేకూర్చిన ఓటర్లు తిరిగి అదే వూపులో సైకిల్‌పై గుద్దుతారు కాబట్టి స్థానిక సంస్థలన్నీ తమ హస్తగతం అవుతాయని ఆశించారు. పార్టీ రహితంగా ఎన్నికలు జరిపితే వర్గాలు, ముఠాలు ప్రబలి గ్రామ స్థాయిలో పార్టీ యంత్రాంగం అదుపు తప్పుతుందని భయపడ్డారు. అది నిజం కూడా.

అయితే గెలుపు పట్ల అంత విశ్వాసం కల్గిన వ్యక్తి ఎన్నికల నిర్వహణలో అప్రజాస్వామికంగా వ్యవహరించడమే విడ్డూరమైన విషయం. స్థానిక సంస్థలకు పునాది వంటి గ్రామ పంచాయితీలను ఎన్నికల నుంచి మినహాయించారు. పంచాయితీలంటే గ్రామ స్థాయిలో పట్టుదలలు, వర్గాలు పెరిగి పార్టీ దెబ్బ తింటుందని భయం. రిజర్వేషన్ల నిర్ణయంలో తమ ఇష్టానుసారం వ్యవహ రించారు. ఎన్నికల కమీషనరు ఇందులో నిమిత్తమాత్రుడే. ప్రభుత్వమే ఆయనకు ఆదేశాలు జారీ చేసింది. అందులోనూ అడుగడుగునా రాజకీయ జోక్యం. ఒకసారి రాష్ట్ర జనాభా ప్రాతిపదిక అని, మరొక సారి జిల్లా స్థాయిలో పరిగణన అని ఉత్తర్వులు జారీచేసి గందరగోళం సృష్టించారు. లాటరీ పద్ధతిలో ప్రకటించిన రిజర్వేషన్లను రద్దుచేసి మళ్లీ లాటరీ నడిపారు. మునిసిపాలిటీల విషయంలో తమకు నచ్చినవారిని గెల్పించు కునేందుకు లాటరీలు, గీటరీలు కూడా ప్రక్కన పెట్టేసి లక్ష్మిపార్వతి ఇష్టానుసారం పేర్లు వ్రాసేశారు.

ఇంకొక ప్రక్క అధికార దుర్వినియోగం పచ్చిగా సాగుతున్నది. ఎమ్మార్వోలను, పోలీసు అధికారులను విచక్షణ లేకుండా బదలీలు చేస్తున్నారు. ఎన్నికల నోటిఫికేషన్ వెల్వడిన తర్వాత కూడా బదలీలు జరిగిపోతున్నాయి. కాంగ్రెస్ అధికారంలో వున్నప్పుడు జరిగిన అసెంబ్లీ ఎన్నికలలోనే తమకు అన్నేసి వేల ఓట్ల మెజారిటీ ఇచ్చి గెల్పించిన ప్రజలు ఇప్పుడు ఒక ఎమ్మార్వోనో, ఒక ఎస్ఐనో చూసి ఓట్లేయకుండా మానుతారా?

తమకున్న అధికారాన్ని ప్రదర్శించుకోవాలనే దర్పం తప్ప, దురహంకారం తప్ప ఈ బదలీల వల్ల వారికి కల్గే ప్రయోజనం ఏమిటో అర్థమే కాదు.

అసెంబ్లీ అయినా, గ్రామ పంచాయితీ అయినా ఎన్నికలంటే ఒకటే. ప్రజాస్వామ్య స్ఫూర్తి రెండింటిలోనూ ఒకటే. నందు [illegible] దగరల్లా ప్రజాస్వామ్యం [illegible]కనులిమి [illegible]న్నికలు తమ [illegible]ష్టానుసారం జరిపించు కోవాలనుకునే సంకుచిత బుద్ధి పాలకులకు తగదు. అది అనర్థ దాయకం. ప్రజలెప్పుడు దానిని హర్షించరు. అధికార దుర్వినియోగంలో అధికారం నిల్పుకొనే అవకాశం వున్నట్లయితే ఎప్పుడైనా రెండవ పార్టీ గెల్చే అవకాశమే వుండదు కదా? ఈ నిజాన్ని గ్రహించ లేకపోవడం పాలకుల అవివేకమే.

---

## జమీన్‌రైతు

16-2-1945
పేజీలు, 10, వెల. 0-1-6

### నెల్లూరు ముచ్చట్లు

#### పెద్దాసుపత్రి

పెద్ద డాక్టరు సర్జరీలో గట్టివాడు. సందేహం లేదు. కేసులు తెగ్గేత పెట్టటం, నర్సులతో బ్యాట్ మెంటన్ ఆడటమేగాని, రోగులను కన్నెత్తి చూడటంలేదని గోలగావుంది. రూరల్ డిస్పెన్సరీ నుంచి వచ్చిన పెద్ద చదువు చదివిన చిన్న డాక్టరును గూర్చి ప్రసక్తి యెందుకులెండి.

#### అవి-ఇవి

రేషన్‌లో ఆరోవంతు విధిగా గోధుమలు తీసుకోవాలను నిర్బంధం ప్రవేశ పెట్టారు. కాని ప్రజలకు ఇచ్చే గోధుమలు మానవమాత్రులు తినదగ్గవేనా అనే విషయం రేషనింగు అధికార్లు ఆలోచించారా? అవేమి గోధుమలో? రవ్వగాదు. నూకానేకాదు. మరలో వేస్తె పిండైకూచుంటాయి. ఇక ఆ పిండితో చపాతీలో, పూరీలో చేసుకోవాలె. ఇది బీదజనానికి అయ్యేపనా? పుష్టికరమైన ఆహారమే అనుకున్నా పంజాబ్ గోధుమలు, లేదా దగ్గరేవున్న కర్నూలు గోధుమలో యివ్వగూడదా? ఎక్కడోవున్న ఆస్ట్రేలియా గోధుమలట: ఆ గోధుమలకు సబ్సిడీ అంటె ఆస్ట్రేలియా వారికి లాభమన్నమాట. ఈ సబ్సిడీ వరిపంటకిచ్చి అధికాహారోత్పత్తి జరిపించి దేశం స్వయంపోషక మయ్యేట్లు చూడగూడదా? ఈ గవర్నమెంటుకు మామాట చెవికెక్కుతుందా?

* * *

హోటళ్లవారు పదార్థాలు నూనెతో తయారు చేసేదీ నేతితో తయారుచేసేదీ, లేక డాల్డాతోనే తయారు చేస్తున్నదీ తెలియపరచు బోర్డు ఒకటి వ్రేలాడకట్టాలని హెల్తువారి ఆజ్ఞ. కల్తీలేకుండా చూచేందుకిదొక మార్గమట. బాగానేవుందిగాని అంతకన్నా కల్తీలేని నెయ్యిగాని, నూనెగాని దొరికేట్లు చూడగూడదా? డాల్డా మంచిదని కొందరు డాక్టర్లు అంటున్నా తింటున్నవారు చిడకురుపుల పాలౌతున్నారట.

**50 ఏళ్లక్రితం ఈవారం**

#### బజారు ధరలు

| | | | |
|---|---|---|---|
| పాతమొలగొలుకులు | 150 | 0 | 0 |
| కొత్త మొలగొలుకులు | 145 | 0 | 0 |
| రాగులు | 170 | 0 | 0 |
| జొన్నలు | 200 | 0 | 0 |
| సజ్జలు | 205 | 0 | 0 |
| వులవలు తూము1కి | 12 | 4 | 0 |

కొంప 10 పేజీలో

---

# రాష్ట్రాన్ని ఫైనాన్స్ కంపెనీలకు తాకట్టు పెట్టడం దారుణం!

దేశాన్ని విదేశాలకు తాకట్టు పెడ్తున్నదని ఎల్లవేళలా కేంద్ర ప్రభుత్వాన్ని దుయ్యబడు తుంటారు ముఖ్యమంత్రి ఎన్టీ రామారావు. ప్రస్తుతం ఆయన రాష్ట్ర ప్రభుత్వాన్ని పియర్‌లెస్ కంపెనీకి తాకట్టు పెట్టే ప్రయత్నాలు చేస్తున్నారు. 300 కోట్లను 16.5 శాతం వడ్డీతో ఒక గుత్త కంపెనీ వద్ద తీసుకొనే బదులు కేంద్ర ప్రభుత్వానుమతితో బాండ్ల ద్వారా ప్రజల నుండి సేకరిస్తె, ఇటు ప్రజలు అటు ప్రభుత్వం లాభం పొందిన వారవుతారు. నమ్మకమేలేని ఫైనాన్సు, ఇతర కంపెనీలలో ఫిక్సెడ్ డిపాజిట్లు, షేర్లు, మ్యూచువల్ ఫండ్లలో పెద్ద మొత్తాలను ఇప్పటికే ప్రజలు ధారాళంగా పెట్టుబడి పెడుతున్నారు. 12శాతంకు పైన వడ్డీకి బాండ్లను జారీ చేస్తె ప్రజలు ప్రోత్సహిస్తారనడంలో సందేహం లేదు. పెట్టుబడుల వైపు ప్రజల నాకర్షించేందుకు ఎన్నో రాయితీలతో తమిళనాడు ప్రభుత్వం ముందుకు సాగడం వల్ల ఎంతో సొమ్మును ప్రజల నుండి పొదుపు పథకాల పేర రాబట్టింది. అదే ధోరణిలో మన ప్రభుత్వం నడిచుంటె బాగుండేది.

కొచ్చిన్ -ఎన్. రామచంద్రారెడ్డి.

### స్థానిక సంస్థల ఎన్నికల్లో తెలుగుదేశం స్వార్థం!

మార్చి నెలలో జరగనున్న స్థానిక సంస్థల ఎన్నికల్లో తెలుగు దేశం పార్టీ రాజకీయ స్వార్థంతో ఇష్టా రాజ్యంగా ప్రవర్తిస్తోంది. రిజర్వేషన్ నిబంధనలు గందరగోళంగా తయారై పలుచోట్ల గొడవలు జరిగాయి. పంచాయితీ రాజ్ సంస్థల ఎన్నికలు రెండు దశల్లో నిర్వహించడమెందుకో అర్థం కావడం లేదు. దీనివల్ల నిధుల కొరతను ఎదుర్కొంటున్న ప్రభుత్వానికి వ్యయ ప్రయాసలు ఎక్కువవుతాయి. బ్యాలెట్ బాక్సులు, పోలీసుల కొరత వంటి కుంటి సాకులు మాత్రమే. పంచాయితీ రాజ్ వ్యవస్థకు పునాదైన గ్రామ పంచాయితీలకు మొదటి దశలోనే ఎన్నికలు నిర్వహించడం సమంజసం. స్వార్థంతో ఆ ఎన్నికలు పెట్టడం లేదు. ముందు పార్టీ ప్రాతిపదికగా మండల, జిల్లా పరిషత్‌లను సులభంగా హస్తగతం చేసుకో వచ్చున్నది తెలుగుదేశం ఎత్తుగడ. క్రింది స్థాయిలో ప్రజాస్వామ్యాన్ని పాదుకొల్పే స్థానిక సంస్థల ఎన్నికల నిర్వహణలో స్వార్థ రాజకీయాలు తగవు.

సూళ్లూరుపేట -కె. రామకృష్ణారెడ్డి.

## జనవాణి

### ఆర్టీసి ప్రైవేట్ పరం తగదు!

ఆర్టీసిని ప్రైవేట్ వ్యక్తులకు అప్పగించాలన్న ఆలోచనను ప్రభుత్వం మానుకోవాలి. ప్రస్తుతంవుంటే పదినుంచి 50శాతం రూట్లను ప్రైవేట్ పరం చేస్తె 20 నుంచి 30 డిపోల వరకు రాష్ట్రంలో మూత బడిపోతాయి. దీనివల్ల 40 వేల మంది కార్మికులు వీధిన పడిపోతారు. ఆర్టీసిని ప్రభుత్వ

కొంప 8 పేజీలో

# నెల్లూరు కలం వీరులు కలబడి కొట్టుకున్నారు!

11తేది నెల్లూరు కస్తూర్బా కళాక్షేత్రంలో జరిగిన జర్నలిస్టుల వార్షికమహాసభలో పాత్రికేయుల పరువు మట్టికొట్టుక పోయింది. పూరంతటికి తమ వ్రాతల ద్వారా నీతులు చెప్పే జర్నలిస్టులు తమ కలాలను పక్కన పెట్టి వచ్చి రౌడీలుగా మారి పోయారు. మైకులు విరగ గొట్టారు; ఒకరితో మరొకరు కలియబడి కొట్టుకొన్నారు. ఆరోపణల్లో భాగంగా బరితెగించి వ్రాయలేని భాషలో దుర్భాషలాడుకున్నారు. మరికొందరు వేదిక నెక్కి మీసాలు మెలేసి, తొడలు తట్టి, కుస్తీ వేదికను గుర్తుచేశారు. ఈ గలీజా కంతటికీ కారణం పదిపైసలకు కూడా పనికిరాని యూనియన్ పదవులు కావడం సిగ్గిల్ల వలసిన విషయం. సింహపురి కలం యోధుల బాహా బాహి చూసి విస్తుపోయిన రాష్ట యూనియన్ నాయకులు రికార్డులన్నీ చంక పెట్టుకొని పక్కదారిగా వెళ్లిపోయి ఒళ్లు కాపాడు కున్నారు. మిన్ను ముట్టిన గావుకేకలకు ప్రక్కనే వున్న పోలీస్ ఆఫీసు నుండి కొందరు పోలీసులు పరుగెత్తుకొచ్చి, పాత్రికేయుల సమావేశమని తెలుసుకొని తిరిగి వెళ్లిపోయారుగాని లేకుంటే లాఠీలేమిటి... బాష్పవాయువు ప్రయోగించ వలసిన వాతావరణం సభలో వుండింది.

**పేట రౌడీల స్పెషల్ కాన్ఫరెన్స్‌ను తలపింపజేసిన జర్నలిస్టుల సభ!**

గొడవకు మూలం ఎన్నికల అధికారిగా వ్యవహరించిన వ్యక్తి పక్షపాత వైఖరి. ఉదయం విలేఖరి నామినేషన్ పత్రం పూర్తి చేయడంలో చేసిన తప్పును ఆయన తన్మరీయులకు అందించారు. దీనితో దిన పత్రికల మధ్య వున్న పగలు సెగలు పొగలు చిమ్మాయి. ఆంధ్రజ్యోతి నెల్లూరు విలేఖరి మైకందుకొని ఎన్నికల అధికారి కంటే ముందుగా నామినేషన్లలో తప్పును వివరించడంతో వాతావరణం క్రమంగా వేడెక్కి పోయింది. కార్యదర్శిగా నామినేషన్ వేసిన వ్యక్తి ఒక పత్రికా యజమాని తొత్తని,అందువల్ల పాత్రికేయుల హక్కులు హరించి వేస్తాడనడంతో ఆ పత్రిక విలేఖరులు విజృంభించి 'జ్యోతి' విలేఖరి చేతిలోని మైకును లాగి అవతల పారేశారు. వేదికపైకి దూసుకెళ్లి వీరంగం చేశారు. ఈ వాతావరణంలో ఎన్నికల అధికారుల్లో ఒకరైన ఆంధ్ర భూమి విలేకరి చేసిన వ్యాఖ్య అగ్నికి కొరవ 10 పేజీలో

కవిత్రయ జయంత్యుత్సవాల ముగింపు సభలో డాక్టర్ ఉడాలి నరసింహ శాస్త్రిని సత్కరిస్తున్న డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, అగస్త్యరెడ్డి వెంకురెడ్డి, జెవిరెడ్డి, గోసుకొండ, దివి నరసింహం

## సణుగుడు

*** ఎస్‌పి గారికి ఒక వెన్నె ముక, జాయింట్ కలెక్టర్ గారికి గుండెకాయ గిఫ్ట్‌గా ఇద్దామా?**

ఐఎఎస్, ఐపిఎస్ అధికారులంటే దేముళ్లేమీ కాదు; ఆకాశం నుంచి వూడిపడి వచ్చిన వారూ కాదు. మన మధ్య నుంచి, మనందరం కలిస్తే ఏర్పడిన సమాజం నుంచి వచ్చిన వారే. సమాజం తిరుతెన్నులు, పోకడలు, నడవడికల ప్రభావం మన మీద ఎంత వుంటుందో, వారి మీదా అంతే వుంటుంది. అందువల్ల ఆ అధికారులు సంఘ మనస్తత్వము, సాంఘిక ధోరణులకు భిన్నంగా వ్యవహరించాలని కోరుకోవడం, వ్యవహరిస్తారని ఆశించడం వ్యర్థం.

అయితే తమ వ్యక్తిగత మేధాశక్తి వల్ల, వున్న తెలివిని వాడుకొనే అవకాశం అందివచ్చి నప్పుడు వుపయోగించు కోవడం వల్ల వారికి పాలనా పరంగా ఒక ఉన్నత స్థాయి, స్థానాలను అలంకరింప జేసింది సమాజం. వారికి విశేష అధికారాలు కట్టబెట్టింది. ప్రజల సొమ్ముతో వారికి బంగళాలు, కార్లు, నౌకర్లు, అటెండర్లు, మందీ మార్బలం, పుష్కలంగా జీతం వంటివన్నీ సమకూర్చి పెట్టింది. ఇవన్నీ వారి కివ్వడం లోని వుద్దేశం - సమాజాన్ని సక్రమంగా నడిపించడంలో, పరిపాలనను నిర్వహించడంలో వారు తమ వంతు బాధ్యతను నిష్పక్షపాతంగా నిర్వర్తిస్తారని! అందుకే వారికిచ్చే శిక్షణ అంత శాస్త్రీయంగా వుంటుంది; వారి చదువుకు ప్రభుత్వం కోట్లాది రూపాయల ప్రజల సొమ్మును వెచ్చిస్తుంది.

**డోలేంద్ర**

ఈ పరిస్థితులలో ఈ అధికారులు ఎట్లా ప్రవర్తించాలి? తమ అధికార విధులను ఎట్లా నిర్వహించాలి? కాని వాస్తవంలో వారెట్లా ప్రవర్తిస్తున్నారు?

నెల్లూరు జిల్లా పోలీసు సూపరింటెండెంట్ శ్రీ జె. పూర్ణచంద్రరావు గారితో నాకు వ్యక్తిగత పరిచయం లేదు. పత్రికల్లో ఫోటోలో తప్ప ఆయన్ను నేను చూడలేదు. ఆయన వ్యక్తిగా ఎటు వంటివారో నాకు తెలియదు. కావలి పోలీస్ స్టేషన్‌ను అర్థరాత్రి విజిట్ చేసి కొరవ 8 పేజీలో

# దొంగల ముఠా దొరికింది!

స్టోన్‌హౌస్‌పేటలో ఇటీవల పలువురు వ్యాపారస్తులపై దొంగచాటుగా మాటువేసి దాడిచేసి సొమ్ము దోచుకుంటుండిన ఒక ముఠాను నెల్లూరు పోలీసులు 12తేది అరెస్ట్ చేశారు. ముఠా నుంచి 12 సవర్ల బంగారు నగలు, 27 వేల రూపాయల నగదు స్వాధీనం చేసుకొన్నట్లు 11తేది టూటౌన్ పోలీస్ స్టేషన్‌లో ఏర్పాటు చేసిన విలేకరుల సమావేశంలో డిఎస్పి లక్ష్మిరెడ్డి వివరించారు. ముఠాలో కడప జిల్లాకు చెందిన దేవరపల్లి జ్ఞానప్రకాశ్, టి. శ్యాంప్రసాద్, చెంద్రాయుడు, కె. మధు కుమార్ రెడ్డి, కర్నూలుకు చెందిన మామిళ్ల వెంకట సుబ్బయ్యలతోపాటు నెల్లూరు శెట్టిగుంట రోడ్డుకు చెందిన తుమ్మకూరు రాజమోహన్, భూషణం సభ్యులు.

**నెల్లూరు సంగతులు**

ఈ ముఠా సభ్యులు వ్యాపార వర్గాల స్థితి గతుల్ని అంచనా వేసి వారిని అనుసరిస్తూ, రాత్రులు ఒంటరిగా ఇళ్లకు వెళ్లే సమయంలో అనుపరాద్లతో దాడిచేసి నగదు దోచుక పోయేవారు. దోపిడి చేసిన అనంతరం ముఠా సభ్యులు వారి వారి సొంత గ్రామాలకు డబ్బులు పంచుకొని వెళ్లిపోవడం వల్ల పట్టుకోవడం కష్టమైనట్లు డిఎస్పి వివరించారు. ముఠాను పట్టుకోవడంలో సిఐ కంపా ప్రసాద్, ఐడి పార్టీ ఇన్‌ఛార్జి నాగేశ్వరరావు, ఎస్ ఐ ఖాసిం శ్రమించినట్లు చెప్పారు. సమావేశం అనంతరం దొంగల ముఠా సభ్యుల్ని పప్పుల వీధి, స్టోన్‌హౌస్‌పేట, రేబాల వారి వీధుల్లో వూరేగించారు. ముఠాను పోలీసులు పట్టకోవడం పట్ల వ్యాపార వర్గాల్లో సంతోషం వ్యక్తమయ్యింది.

# నెల్లూరు టౌన్‌లో మౌర్యుల నాటి వెండి నాణాలు!

**నెల్లూరు జిల్లా ప్రాచీన చరిత్రకు నూతన వ్యాఖ్యానం!**

**కొల్లూరి సాయిభక్త కేశవ**

సాంకేతిక సహాయకుడు, పురావస్తుశాఖ, నెల్లూరు

(గతసంచిక తరువాయి)

పురావస్తుశాఖ అన్వేషణలో మధ్య చారిత్రక కాలంనాటి పాటిదిబ్బను కనుగొన్నారు. ఇది దాదాపు ఆరు ఎకరాల విస్తీర్ణం కలిగి వున్నది. శిథిలమైన ఆలయం కూడా ఈ భూమిలోనే నిక్షిప్తమై ఉండవచ్చు. శ్రీనాధుడు ఈ పట్టణాన్ని కాల్పట్టణమని పేర్కొన్నారు. ఈ రేవుకు సంబంధించిన వివరాలు తెలియజేశారు.

### దుగరాజపట్నం

తూర్పు చాళుక్య రాజైన రెండవ అమ్మరాజా సర్వసేనా నాయకుడు, కటకాధీశుడు అయిన దుగ్గరాజా పేరున ఈ దుగరాజపట్నం ఏర్పడిందని చరిత్రకారుల అభిప్రాయం. క్రీ.శ. 945 నుండి 970 వరకు రెండవ అమ్మరాజా పరిపాలనా కాలంలో దుగ్గరాజా స్వర్ణముఖీ తీరం వరకు చాళుక్య సామ్రాజ్యాన్ని విస్తరించాడు. మరి కొంతమంది చరిత్రకారులు క్రీ.శ. 5,6 శతాబ్దంలకు చెందిన రేనాటి చోళుల కాలం లోనిదిగా ఈ పట్టణాన్ని పేర్కొన్నారు. పురావస్తు అన్వేషణలో ఇక్కడ తొలి మధ్య చారిత్రక యుగాలకు చెందిన కుండపెంకులు, పూసలు కనుగొనబడ్డాయి. ఇక్కడ తెలుగు చోళ, విజయనగర రాజుల కాలం నాటి దేవాలయాలు శిథిలావస్థలో కన్పిస్తున్నాయి.

ఈ గ్రామం క్రీ.శ. 17 వ శతాబ్దంలో 'డచ్' వారి వర్తక కేంద్రంగా విలసిల్లింది. ఇంగ్లీషు వారు తూర్పుతీరంలో మొట్టమొదటగా ఈ గ్రామంలో కాలిడి నారని ప్రతీతి. వీరు బకింగ్‌హామ్ కాలువకు సముద్రానికి మధ్య కోటను నిర్మించారు. వాటి శిథిలాలు ఇప్పటికీ అక్కడ కన్పిస్తాయి. బ్రిటిష్ వారు డచ్‌వారు ఇక్కడ నుంచి పోటీపడి వర్తకం చేసేవారు. పురావస్తు శాఖ వారు అక్కడ త్రవ్వకాలు జరిపి మధ్య చారిత్రక యుగాల నాటి పూసలు, మృణ్మయ పాత్రల శకలాలు, బ్రిటిష్‌వారి నాణాలు సేకరించారు.

### రెడ్డిపాళెం

శ్రీహరికోటకు ఉత్తరాన రెడ్డిపాళెం అనే గ్రామం వుంది. దీనికి దగ్గరలోనే ఆర్మోగాన్ అనే ప్రసిద్ధి చెందిన రేవు పట్టణం కూడా ఒకటి వుంది. తూర్పు చాళుక్య రాజైన గుణగ విజయాదిత్యుని సేనా నాయకుడైన పంద్రంగడు ఈ ప్రాంతాన్ని క్రీ.శ. 849 లో జయించి తన జ్ఞాపకార్థం రెడ్డిపాళెం నకు దగ్గరలో పంద్రంగేశ్వరాలయాన్ని నిర్మించాడు. ఈ దేవాలయానికి దగ్గరలో వెలసిన ఊరే పంద్రంగంగా పిలువబడుతున్నది.

"అహనానూరు" అనే తమిళ గ్రంథం చాలా మంది కవులను, తమిళ దేశపు రాజులను, నాయకులను గురించి తెలుపుతుంది. దీని ప్రకారం తిరాయన్ అనే రాజా తిరుపతిని పాలించుచున్నట్లునూ, ఆ రాజ్యానికి 'పావత్రి' అను రేవు పట్టణం వుండినట్లు తెలుస్తుంది. రెడ్డిపాళెంలో దొరికిన శాసనాలలో ఈ గ్రామాన్ని 'పావత్రి కొట్టం' 'పావత్రినాడు' అను పేర్లతో పిలిచారు. అయితే తమిళ గ్రంథంలో వ్రాయబడిన పావత్రియు, రెడ్డిపాళెం శాసనాలలో ఉదహరించబడిన పావత్రియు కొరవ 11 పేజీలో

# ఆయుర్వేద మందులో సారాను మరపించే మత్తు!

సంపూర్ణ మద్య నిషేధంతో మందు బాబులు తమకు ప్రియమైన సరకు దొరకక అల్లాడి పోతున్నారు. మత్తిచ్చే పదార్థం ఏది వున్నా త్రాగేందుకు సిద్ధ పడుతున్నారు. గూడూరు తాగుబోతులు మరింత ముందుకెళ్ళి సూర అనే ఆయుర్వేద ఔషధాన్ని కనిపెట్టి మత్తులో మునిగి తేలుతున్నారు. మద్రాస్ నుంచి దొంగచాటుగా తెస్తున్న మద్యం సీసాల ధర వందల రూపాయలు పలుకు తుండడంతో సామాన్యులు ఈ వైపుకు మళ్లారు. డాబర్ కంపెనీ బాలింతల కోసం ఈ మృత సంజీవి సూర అనే ఔషధాన్ని తయారు చేస్తున్నది. అందులో మత్తిచ్చే పదార్థం వుంది. బాలింతలు నొప్పులు తట్టుకోను మూతల డోసులలో ఈ మందు త్రాగిస్తారు. షాపుల్లో వారానికో, పది రోజులకో ఒకసారి ఒక సీసాగా అమ్ముడు పోయే సూర డిమాండ్ చూసి షాపుల వాళ్లు కూడా ఆర్డర్ల పై ఆర్డర్లు ఇస్తున్నారు. వైద్యుల సలహా మేరకు మినహా వారికి దీన్ని ఇవ్వకుండేలా డ్రగ్ ఇన్స్‌పెక్టర్ తగిన చర్యలు తీసుకోవాలని ప్రజలు కోరుతున్నారు.

### టెలిఫోన్ తీగల చోరీ

గూడూరు వెలయానంద పురం, నెహ్రూ నగర్, తూర్పు వీధి, మిట్ట పాళెం ప్రాంతాల్లో 1200 మీటర్ల టెలిఫోన్ వైరు చోరీ అయ్యింది. దీనితో ఈ ప్రాంతాల్లో సుమారు 100 ఫోన్లు పని చేయడం లేదు. 1200 మీటర్ల వైరంటే కిలో మీటరు పైగా వస్తుంది. ఇంత వైరు దొంగలించ బడినా అధికారుల్లో ఎందువల్లో వులుకు, పలుకు లేదు.

> గూడూరు
> త్రాగుబోతులు
> కనిపెట్టిన
> సురాపానం

### గూడూరు రోటరీ క్లబ్ త్రిభువన విజయం!

శ్రీ కృష్ణ దేవరాయల సభను భువన విజయం అంటుండే వారు. ఆ సభలోని కవులు, పండితులు అమర లోకానికి వెళ్ళి వందల ఏళ్లు గడిచాయి. ఇంద్రుని త్రిభువన సభలో వారంతా ప్రస్తుతం తమ ప్రతిభా పాండిత్యాలను ప్రదర్శించడమనే ఊహకు రూపమే ఈ నూతన సాహిత్య ప్రక్రియ - త్రిభువన విజయం. గూడూరు వెస్ట్ రోటరీ క్లబ్ 26 తేదీ డి.ఎస్.ఆర్. కమ్యూనిటీ హాల్‌లో తొలిసారిగా దీనిని నిర్వహిస్తున్నది. ఇందులో మహేంద్రునిగా గుంటూరు హిందూ కాలేజి ప్రిన్సిపాల్ డాక్టర్ ప్రసాదరాయ కులపతి వ్యవహరిస్తారు. తిక్కనగా మొవ్వ వృషాద్రిపతి, శ్రీనాథునిగా డాక్టర్ జంధ్యాల మహతీ శంకర్, అన్నమాచార్యునిగా డి.ఎస్.ఆర్. ఆచార్య, రామదాసుగా రావూరి ప్రసాద్, క్షేత్రయ్యగా ఎస్. రాజన్న కవి, తారాకవిగా మెట్ట వెంకటేశ్వర రావు, కవి రాక్షసుడుగా టి.ఎస్.ఆర్. ఆంజనేయ ప్రసాద్, వీర బ్రహ్మేంద్ర యోగిగా ధారా రామనాథ శాస్త్రి వ్యవహరిస్తారు. అందరినీ తరలి రమ్మంటున్నారు క్లబ్ అధ్యక్ష కార్యదర్శులు వై. సంజీవ రెడ్డి, ఎ.వి. సురేష్.

### రాపూరుకు ఎస్.టి.డి.

రాపూరు ప్రజలు ఎప్పటి నుంచో కోరుకుంటుండిన టెలిఫోన్ ఎక్ఛేంజికి ఎస్.టి.డి. సౌకర్యం కల్పించారు. 10 తేది నుంచి ఎస్‌టిడి సౌకర్యం వాడకంలోకి వచ్చింది. 08621 అనే సంఖ్య రాపూరు ఎస్‌టిడి కోడ్ నెంబరుగా నిర్ణయించారు.

# కావలి ఆర్టీసీ పెడ్తున్న కుచ్చులటోపీ - ఫైవ్‌స్టార్ బస్సులు!

కావలి డిపో మేనేజరు బస్సులకు కొత్త కొత్త పేర్లు పెట్టి ప్రయాణీకుల పై ఏదో ఒక రూపంలో అదనపు భారం మోపే ప్రయత్నాలు చేస్తుంటారు. అటువంటిదే కావలి నుండి నెల్లూరు అయ్యప్ప గుడి వరకు నడిచే ఫైవ్‌స్టార్ సర్వీసు. ఈ బస్సులు కావలి నుండి బయలుదేరి తిప్ప, రాజుపాళెం, నెల్లూరులో ఆత్మకూరు బస్టాండ్, ఆర్టీసి బస్టాండ్, అయ్యప్పగుడి వద్ద ఆగి ప్రయాణీకులను ఎక్కించు కొంటాయి. కావలి నుండి అయ్యప్ప గుడి వరకు 16 రూపాయల ఛార్జి వసూలు చేస్తామని రోడ్డు భద్రతా వారోత్సవాల ముగింపు సమావేశంలో విలేఖరులకు డిపో మేనేజరు చెప్పారు. మిగతా డిపోల ఎక్స్‌ప్రెస్ సర్వీసుల్లో కావలి నుండి నెల్లూరు ఆర్టీసీ వరకు 12 రూపాయలు వసూలు చేస్తుంటే, కావలి డిపో వారు మాత్రం 14 రూపాయలు వసూలు చేస్తూ ఇప్పటికే ప్రయాణీకులను దోచుకుంటున్నారు. మళ్లీ మరో ముచ్చటైన పేరుతో కుచ్చులటోపీ తగిలిస్తున్నారు. రేటు పెంచకుండా ఫైవ్ స్టార్ సౌకర్యం కల్పించి వుంటే ప్రజలు సంతోషించే వారు. రూరల్ సర్వీసుల కోసం డిపోలో వున్న పాత గ్యారేజీను రూరల్ బస్టాండ్‌గా రూపొందించినట్లు డిపో మేనేజర్ చెప్పారు. బస్టాండ్‌లో పోలీస్ ఔట్‌పోస్ట్ ఏర్పాటు చేస్తామని సమావేశంలో పాల్గొన్న కావలి సర్కిల్ ఇన్స్‌పెక్టర్ కె. శ్రీనివాస రావు చెప్పారు. ఈ పని చేస్తే ప్రజలు సంతోషిస్తారు.

## జిల్లా వార్తలు

### సంఖ్య పెరిగితే ఆదాయపు పన్ను తగ్గుతుంది!

ఆదాయపు పన్ను చెల్లించే వారి సంఖ్య పెరిగితే పన్ను రేటు బాగా తగ్గి పోతుందని గుంటూరు రేంజ్ డిప్యూటీ ఇన్‌కంటాక్స్ అధికారి డాక్టర్ రఘు చెప్పారు. కావలి పట్టణ ఛాంబర్ ఆఫ్ కామర్స్ ఏర్పాటు చేసిన సభలో ఆయనమాట్లాడారు. గుంటూరు కేంద్రంగా వున్న ఆదాయపు పన్నుల శాఖ ఈ ఏడాది వ్యాపార వర్గాల నుంచి పన్ను రూపేణా 37 కోట్ల రూపాయల వసూళ్లను రాబట్టాలనే లక్ష్యంతో పనిచేస్తున్నట్లు చెప్పారు. గత ఆర్థిక సంవత్సరంలో ఈ రేంజ్

కొరవ 7 పేజీలో

# ఎమ్మెల్యేల ఇష్టారాజ్యం- కాంగ్రెస్‌కు అభ్యర్థుల కరువు!

## నెల్లూరు ముచ్చట్లు

విలక్షణుడు

### కలెక్టర్ పదవీ స్వీకారం

కొత్త కలెక్టర్ డాక్టర్ ప్రేమ్‌చంద్ 15వతేది పదవి స్వీకరించారు. దీనితో ఆయన నెల్లూరు రాకపోవచ్చునన్న వదంతులు, సాంబశివరావు గారి బదలీ రద్దు వూహాగానాలకు తెరపడింది.

ప్రేమ్‌చంద్ హిమాచల్ ప్రదేశ్ వాస్తవ్యుడు. సిమ్లాలో మొదట ఎంబిబిఎస్ చదివి తర్వాత ఐఎఎస్ పాసైనారు. కలెక్టర్‌గా ఆయనకిది తొలి బాధ్యత. పాడేరులో సబ్‌కలెక్టర్‌గా, రంపచోడవరం గిరిజనాభివృద్ధి సంస్థ ప్రాజెక్ట్ డైరెక్టర్‌గా, ఆరోగ్య శాఖ జాయింట్ సెక్రెటరీగా పనిచేశారు. ఆయన మాజీ కలెక్టర్ సాంబశివరావు ఐఎఎస్‌లో సహాధ్యాయులు; స్నేహితులు.

### జనార్ధనరెడ్డి

జిల్లాలో మండల, జి.ప.లకు, మున్సిపాలిటీలకు అభ్యర్థులను ఎంపిక చేసేందుకు మాజీ ముఖ్యమంత్రి, రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి 15వతేది నెల్లూరు వచ్చారు. 16తేది వెంకటగిరి, గూడూరులలో అభ్యర్థులను ఎంపిక చేశారు. ఈరోజు (17తేది) నెల్లూరులో చర్చలు జరిపారు. బహుశా 18తేది రాత్రికి హైదరాబాదు తిరిగివెళ్తారు.

### అయ్యోపాపం వేమారెడ్డి!

జనార్ధనరెడ్డి గారిపై అనవసర కోపంలో అలిగి తెలుగుదేశం పంచన చేరిన వేమారెడ్డి రామచంద్రారెడ్డిగారి పరిస్థితి అత్యంత జాలిగొల్పేటట్లు వుంది. ఎన్టీఆర్ సమక్షంలో తాను తెలుగుదేశంలో చేరినట్లు ఆయన తనకు తాను ప్రకటించుకున్నా, జిల్లా తెలుగు నాయకులెవ్వరూ దాన్ని అంగీకరించడం లేదు. ఆయన్ను తమలో ఒకడిగా భావించడంలేదు. మండలాల ఎన్నికలకు సంబంధించి వేమారెడ్డిని వారు పూర్తిగా విస్మరించారు. ఈ అవమానం సహించలేక ఆయన ఇటీవల కోటకు వెళ్ళి ఎన్సిని శరణు వేడారు. మొన్నటి వరకు వీరిద్దరూ ఆగర్భ శత్రువులు. నన్ను తెలుగుదేశంలో చేర్చుకున్నట్లా లేనట్లా తేల్చి చెప్పండని ఆయన ఎన్సిని నిలదీశారట. ఆయనంత దీనంగా అడిగేసరికి, ఎన్సికి కూడా జాలి కల్గినట్లుంది. ఎద్దుల వేణుగోపాలరెడ్డి సరేనంటే చిల్లకూరు మండలంలో ఒకటి రెండు పంచాయితీలు నీకు వదలి పెడతానని వరం ఇచ్చారట. వేణు గోపాలరెడ్డి మొదట ఈ ప్రతిపాదనను తిరస్కరించారు. అయితే నెల్లూరులోని ఒక కోచింగ్ సెంటర్ నిర్వాహకుడు ఇద్దర్నీ కలిపి, రాజీ చేసినట్లున్నారు. అదే మహా ప్రసాదమనుకొని రామచంద్రారెడ్డిగారు ఎన్సిని తమ బంగళాకు తీసుకవెళ్ళి విందు ఇచ్చి, కృతజ్ఞతలు చెప్పారు.

కాంగ్రెస్‌లో ఎంతటి పులివలె బ్రతికారు రామచంద్రారెడ్డి గారు? ఒక్క చిన్న పొరపాటుతో ఆయన రాజకీయ జీవితం ఒడ్డున పడ్డ చేపవలె మారిపోయింది. శత్రువుగా భావించిన వారి శరణు కోరవలసి వచ్చింది. ఇన్ని అవమానాలను ఆయనెట్లా సహించగల్గుతున్నారో మరి!

### అరుపులు కేకల మధ్య మునిసిపల్ రిజర్వేషన్లు!

నెల్లూరు మునిసిపల్ వార్డుల రిజర్వేషన్ వ్యవహారమై 14 తేది కలెక్టరేట్ లోని సైక్లోన్ మీటింగ్ హాల్‌లో జరిగిన సమావేశం అరుపులలుకేకల మధ్య సాగింది. ఎస్సి వార్డుల రిజర్వేషన్ల మార్పే గొడవకు మూల కారణం. గతంలో ఎస్సిలకు ఆరు వార్డులు కేటాయించగా ప్రస్తుతం వాటిని ఐదుకు కుదించడంపై ఎసిస నాయకులు కలెక్టర్, మునిసిపల్ కమీషనర్‌లతో గొడవ పడ్డారు.



కార్యకర్తలు, గ్రామ నాయకులను గాలికి వదిలిస్తే తాము కృతఘ్నులుగా గుర్తింప బడతమే కాదు - పై ఎన్నికల నాటికి తమకోసం జెండా పట్టే మనిషే మిగలడన్న వాస్తవాన్ని వీరు విస్మరిస్తున్నట్లున్నారు.

ఇంకొక ప్రక్క తెలుగుదేశం శిబిరంలో తిరునాళ్ల సందడిగా వుంది. గ్రామస్థాయి నుంచి జిల్లాపరిషత్ ఎన్నికల వరకు అన్ని పదవులకూ పోటా పోటీలుగా టిక్కెట్ల కోసం ఎగబడు తున్నారు. నిన్నగాక మొన్న జరిగిన ఎన్నికల్లో అఖండ విజయం సాధించిన పార్టీ కాబట్టి, టిక్కెట్ దొరికితే గెల్చినట్లేనన్న అభిప్రాయం బలంగా వుంది. అందువల్ల ఎమ్మెల్యేల చుట్టూ ఈగల్లా ముసురుతున్నారు అభ్యర్థులు కాగోరే వారు. సిపిఎం, సిపిఐ పార్టీలు సైతం ఎక్కడలేని ఉత్సాహం చూపుతున్నాయి.

టిక్కెట్ల సర్దుబాట్లలో సిపిఎం, తెలుగుదేశం చర్చలు బెడిసి కొట్టాయి. సిపిఎం చాలా పెద్ద కోటా అడిగింది. అందుకు - ఎవరూ అంగీకరించలేదు. చిక్కుముడిని విప్పదీసే బాధ్యత అధిష్టాన వర్గం పై పెట్టి ఎవరి పాటికి వారు నామినేషన్లు వేయాలని నిర్ణయించారు.

తెలుగుదేశంలో టిక్కెట్ల పంపకం దాదాపుగా ఎమ్మెల్యేల ఇష్టా రాజ్యమే! ఎవరి నియోజక వర్గాలలో వారు తమ తమ అభ్యర్థులను ఎంపిక చేసి, రాజ ముద్రిక కోసం హైదరాబాదుకు పంపారు. బీగా నారసింహా రెడ్డి గారు ఈ జాబితాలు మోసుకొని రైలెక్కారు. ఒకటి రెండు చోట్ల తప్ప పెద్దగా ఎమ్మెల్యేలు ఇచ్చిన పేర్లలో మార్పులు వుండే అవకాశం లేదు. టిక్కెట్ వస్తే గెల్చినట్లేనని వాతావరణం వుండడంతో ఎమ్మెల్యేలు తమకు విధేయులుగా వుండే వారిని ఎంపిక చేసుకొంటున్నారు. కాంగ్రెస్ నుంచి వచ్చే పోటీని వారెవరూ సీరియస్‌గా తీసుకోవడం లేదు. అయితే కొన్ని చోట్ల అభ్యర్థులను, మరీ ముఖ్యంగా మహిళా అభ్యర్థులను వెతికి పట్టడం వారికి కష్టంగానే వుంది.

జిల్లా పరిషత్‌కు మాత్రం డాక్టర్ ఎన్. నాగభూషణమ్మను అభ్యర్థిగా నిర్ణయించినట్లే భావించాలి. ఆమెను మనుబోలు జిప్రప ప్రాదేశిక నియోజక వర్గం నుంచి పోటీ చేయిస్తున్నారు. కాంగ్రెస్ నాయకుడు శ్రీ ఆనం రామనారాయణ రెడ్డికి ఇది పెద్ద సవాలే. సహజంగా తెలుగుదేశంకు బలీయమైన ఫిర్కా ఇది. ఎమ్మెల్యే వైఎస్ఆర్‌కు వ్యక్తిగత పలుకుబడి వుంది. గట్టి పోటీ ఇచ్చి ఆమెను ఇక్కడ ఓడించ గల్గితే

జిల్లా పరిషత్ ఎన్నికలు
మొదటి పేజీ కొరవ

తెలుగుదేశం పరాభవం పాలౌత. ఈ సవాల్‌ను రామనారాయణ రె. ఎట్లా స్వీకరిస్తారో వేచి చూడాలి.

కాంగ్రెస్ పార్టీలోనూ మొన్న ఓడిన అసెంబ్లీ అభ్యర్థుల ఇష్టానుసారం మండల, జిప అభ్యర్థులను ఎంపిక చేసే స్వేచ్ఛ కల్పించారు. అయితే ఒకరిద్దరికి తప్ప, తక్కిన వారిలో ఆ ఉత్సాహం లేదు. గెలుస్తామన్న నమ్మకం ఏ కోశానా లేని పరిస్థితులలో ఎందుకొచ్చిన రిస్క్ అనుకుంటున్నారు వారు.

అధికారం పోవడం తోటే కాంగ్రెస్ ఏ గతికి చేరుకున్నదండి!

### మారిన మండల రిజర్వేషన్లు

మండల ప్రజా పరిషత్ అధ్యక్ష పదవుల రిజర్వేషన్ల విషయమై ప్రభుత్వం కొన్ని మార్పు చేర్పులు చేసింది. ఎస్టిలకు కేటాయించి వుండిన 4 మండలాల్లో మహిళలకు రిజర్వు చేసి వుండిన సైదాపురంను రద్దు చేసి ఎస్టి జనరల్‌గా చేసారు. గతంలో ఎస్టిలకు కేటాయించి వుండిన విడవలూరును ఎస్టి మహిళలకు రిజర్వు చేసారు. గతంలో ఎస్సిలకు కేటాయించి వుండిన 10 స్థానాల కంటే మరో స్థానం - జలదంకి - అదనంగా ఎస్సి మహిళలకు ఇచ్చారు. గతంలో ఎస్సి మహిళలకు కేటాయించిన కొడవలూరును ఎస్సి జనరల్ చేసారు. బిసిలకు కూడా ఈ దామాషాన కోటా పెరిగి 13 మండలాలు అయ్యాయి. జనరల్ స్థానాలు 20 నుంచి 18 కి తగ్గాయి.

### రిజర్వేషన్లు ఇవి

ఎస్టిలు: సైదాపురం, ఓజిలి, చిల్లకూరు, విడవలూరు (మహిళ)

ఎస్సిలు: కోట, గూడూరు, వెంకటాచలం, తడ, కొడవలూరు నాయుడుపేట, అల్లూరు; మహిళలకు; జలదంకి, సూళ్లూరుపేట, తోటపల్లి గూడూరు దగదర్తి మండలాలు కేటాయించారు.

బిసిలు: మనుబోలు, ఇందుకూరుపేట, కోవూరు, వింజమూరు, బాలాయపల్లి, నెల్లూరు, వాకాడు, అనంతసాగరం, ఉదయగిరి; మహిళలకు; అనుమ సముద్రం పేట, బుచ్చిరెడ్డి పాళెం, ముత్తుకూరు, చేజర్ల మండలాలు ఇచ్చారు.

జనరల్: సీతారామపురం, వరికుంటపాడు, దుత్తలూరు, మర్రిపాడు, కొండాపురం, బోగోలు, సంగం, ఆత్మకూరు, రాపూరు, చిట్టమూరు, దొరవారి సత్రం, వెంకటగిరి. వీటిలో కావలి, కలువాయి, కలిగిరి, పెళ్లకూరు, డక్కిలి, పొదలకూరులను మహిళలకు కేటాయించారు.

ఎమ్మెల్యే రమేష్ రెడ్డి సర్దను ప్రయత్నించారు గాని ఆయనకు రిజర్వేషన్ లెక్కలు సరిగా అర్థం కాకపోవడంతో అయోమయ పడ్డారు. వార్డుల వారీ వివరాలు క్రింద ఇస్తున్నాం.

జనరల్: 1, 3, 9, 15, 18, 22, 24, 29, 30, 33, 35, 36, 37, 41, 43.

జనరల్ మహిళలకు: 6, 8, 13, 14, 20, 27, 32

బిసిలు: 2, 4, 7, 10, 12, 21, 25. 31. 34, 38.

బిసి మహిళలకు: 5, 17, 26, 39, 40

ఎస్సిలు: 11, 16, 18 వారిలో మహిళలకు 23, 42

ఎస్టిలకు 44 మహిళలకు 19 వార్డు కేటాయించారు.

### కావలి మునిసిపాలిటీ

కావలిలోని మొత్తం 28 వార్డులలో 14 వార్డుల్ని జనరల్‌కు కేటాయించారు. వీటిలో 5 మహిళలకు ఇచ్చారు. బిసిలకు ఇచ్చిన ఆరు వార్డుల్లో 3 మహిళలకు కేటాయించారు. ఎస్సిల కిచ్చిన మూడు వార్డుల్లో ఒకటి మహిళలకు, ఎస్టిలకు కేటాయించిన రెండు వార్డుల్లో ఒకటి మహిళలకు రిజర్వు చేసారు.

జనరల్‌కు కేటాయించిన వార్డులు: 1, 2, 4, 11, 13, 14, 23, 25, 27 మహిళలకు 3, 7, 15, 20, 21.

బిసిలు: 6, 12, 16, 17, 22, 24; మహిళలకు 18, 19, 26.

ఎస్సిలు: 9, 10; మహిళలకు 8

ఎసిటిలు: 5, 28 మహిళకు 5 వార్డు కేటాయించారు.

### గూడూరు మునిసిపాలిటీ

గూడూరు మునిసిపాలిటీలోని మొత్తం 28 వార్డుల్లో 13 జనరల్, 9 బిసిలు, 5 ఎస్సిలకు 1 స్థానం ఎస్టిలకు కేటాయించారు.

జనరల్ వార్డులు: 4, 5,

కొరవ 7 పేజిలో

# మునిసిపాలిటీలకు ముమ్మరపోటీ!

## తెలుగుదేశం తిరుమలరావు, కాంగ్రెస్ ఆనం వివేకానందరెడ్డి ముందంజలో వున్నారు!

జిల్లా పరిషత్‌లకు పూర్తి భిన్నంగా మునిసిపాలిటీలలో, మరీ ముఖ్యంగా నెల్లూరు మునిసిపాలిటీలో కాంగ్రెస్ టిక్కెట్టుకు సమస్థాయిలో పోటీవుంది. జిల్లాలో మరెక్కడా అభ్యర్థులను ఎంపిక చేయడం, ప్రోత్సహించడం వంటివి పూనుకోని మాగుంట సుబ్బరామిరెడ్డి గారు సైతం నెల్లూరు మునిసిపాలిటీలో తమ అభ్యర్థులను హోల్‌సేల్‌గా నిలబెట్ట డానికి తహ తహలాడుతున్నారు. రెండు నెలల క్రితం తెలుగుదేశం ఎమ్మెల్యేలు వేల మెజారిటీతో గెల్చిన నెల్లూరు, గూడూరు టౌన్‌లలో కూడా జరుగుతుందన్న నమ్మకం కల్గదం లేదు. అధిష్టాన వర్గం స్థాయిలో లోక్యం వుండేటట్లుంది. వైటి నాయుడు-రెవిన్యూమంత్రి శ్రీ చంద్రబాబు నాయుడును వాటేసి పట్టుకొని వున్నారు. ఆయన నుంచి హామీ కూడా పొందాడని వినికిడి- 83 నుంచి తెలుగుదేశంలో వున్నా తనకెప్పుడూ పదవి అవకాశం ఇవ్వలేదన్నది నాయుడు అభ్యర్థన. కాని అతను ఛైర్మన్ అయితే తన కలివికాకుండా పోతాడని రమేష్‌రెడ్డి భయపడుతున్నారు. పిటి. రంగరాజన్ పూర్వాశ్రమంలో రమేష్‌రెడ్డి అంతేవాసి. అవుతుంది.

ఆనందరెడ్డి, శ్రీధరకృష్ణారెడ్డిల పేర్లు రమేష్‌రెడ్డి పైకి చెప్తున్నప్పటికి అంతరంగంలో మాత్రం ప్రాణ స్నేహితుడు తిరుమలరావు వున్నాడని, చివరకు అతడే అభ్యర్థి అయినా ఆశ్చర్యం లేదని చెప్తున్నారు. రమేష్‌రెడ్డి అంతటి సమర్థుడే!

కాంగ్రెస్ పరిస్థితి పూగిసలాటగా వుంది. పార్టీ ఇప్పుడున్న పరిస్థితులలో ఆనం వివేకానంద రెడ్డి అభ్యర్థి కావాలి. కాంగ్రెస్‌లో వివేకకు ఎప్పుడూ ఏ టిక్కెటూ రాలేదు. ఛైర్మన్ ఎన్నికను

## లక్ష్మీపార్వతికి30లక్షల ఆఫర్- అన్నను శరణువేడిన రమేష్‌రెడ్డి!

కాంగ్రెస్ తరపున కౌన్సిలర్లుగా ఛైర్మన్‌లుగా నలబడడానికి కార్యకర్తలు ఉత్సాహంతో ముందుకు రావడం సంతోషించ దగిన పరిణామం.

మూడు మునిసిపాలిటీలలో నెల్లూరు ఒక్కటే జనరల్. గూడూరు హరిజన పురుషులకు; కావలి గిరిజన మహిళకు రిజర్వు అయింది. రెండు పార్టీలలోనూ అభ్యర్థుల ఎంపిక సమస్యే అవుతున్నది. తెలుగు దేశంకు సంబంధించి మండల, జి.ప అభ్యర్థుల ఎంపిక దాదాపుగా ఆయా శాసన కాని, ఆ చనువుతో హైదరాబాదులో పరిచయాలు పెంచుకొని, ఎమ్మెల్యే టిక్కెట్‌కి దోటి వేయడంతో రమేష్‌రెడ్డి అతడి అభ్యర్థిత్వాన్ని పూర్తిగా వ్యతిరేకిస్తున్నాడు. రంగరాజన్, ఎన్టీఆర్ సలహాదారైన దేవనాథన్ ద్వారా లక్ష్మీపార్వతి ఇంట్లో ప్రవేశం సంపాదించి, టిక్కెట్ ఇస్తే పాతిక లక్షల ముడుపు ఇస్తానని ఆఫర్ చేశాడట. మొదట ఆమె ఈ మొత్తం విని మెత్తబడినట్లున్నారు. అడ్వాన్సుగా కొన్ని బంగారు నగలు, పట్టుచీర దృష్టిలో పెట్టుకొని ఆయన మొన్నటి అసెంబ్లీ సమయంలో టిక్కెట్‌కు దరఖాస్తు కూడా చేయలేదు. జనార్ధనరెడ్డికి చాలా ఎక్కుగా నమ్మకంగా వుంటున్నాడు. టౌన్‌లో పలుకుబడి, పరిచయాలు, కార్యకర్తల బలం కల్గిన కాంగ్రెస్ వాది వివేకా గెల్చే అభ్యర్థిని ఎంపిక చేయాల్సి వుద్దేశ్యం వుంటే వివేకానందరెడ్డినే ఎంపిక చేయాలి.

కాని అది అంత సులువుగా జరిగేట్లు లేదు. మాగుంట

## ప్రసన్నను నిల్పాలని మాగుంట పంతం- జనార్ధనరెడ్డి నిర్ణయమే ఫైనల్!

సభ్యుల ఇష్టాను సారం జరిగిపోయింది. కాని, మునిసిపాలిటీలలో మాత్రం పేచీలు తప్పడం లేదు. నెల్లూరు టౌన్‌లో సహజంగా శ్రీ రమేష్ రెడ్డి మాటే చెల్లుబాటు కావాలి. రమేష్ రెడ్డిపై తీవ్రమైన ఒత్తిడి వుంది. మొన్నటి ఎన్నికలలో శ్రమపంచన లేకుండా పనిచేసిన ముంగమూరు శ్రీధరకృష్ణారెడ్డి, వైటి నాయుడు, పిటి రంగరాజన్, సంక్రాంతి కళ్యాణ్, తన స్వంత బావమరిది వి. ఆనందరెడ్డి తదితరులంతా ఈ పదవిని ఆశిస్తున్నారు. ఎవరికి ఇవ్వాలన్నది సమస్య. కాబోయే ఛైర్మన్ తనకు అన్ని విధాలా అనుకూలుడుగా వుండాలని భావిస్తున్నాడు రమేష్‌రెడ్డి. ఛైర్మన్ ప్రతికూలుడైనా, లేదా మనస్ఫూర్తిగా సహకరించక పోయినా ఎమ్మెల్యేగా తాను టౌన్‌లో బ్రతకడం కష్టం. కార్యకర్తలు చేజారి పోతారు. పనులు అనుకున్నట్లు జరగవు. ప్రజలను సంతృప్తి పరచలేరు. అందువల్ల ఛైర్మన్ అభ్యర్థి ఎంపిక పట్ల రమేష్ రెడ్డి చాలా అప్రమత్తంగా వ్యవహరిస్తున్నారు.

అయితే ఈ ఎంపిక కేవలం ఆయన ఇష్టాఇష్టాలపై ఆధారపడి స్వీకరించి, రంగరాజన్‌కు ఒక పూట భోజనం పెట్టి పంపించారు. అతను చాలా నమ్మకంతో నెల్లూరుకు తిరిగి వచ్చాడు.

కానీ ఈలోగా, రవీంద్ర నాయుడు అనే రైస్ మిల్లర్స్ అసోసియేషన్ నాయకుడు, ఆత్మకూరు ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్య నాయుడు ద్వారా లక్ష్మీపార్వతిని కలిసి, 30 లక్షలకు రేటు పెంచాడట. ఆయనకు డాక్టర్ వెంకటేశ్వరరావు సిఫార్సు సైతం లభించింది. సర్వేపల్లి ఎమ్మెల్యే శ్రీ చంద్రమోహన్ రెడ్డి ఈ అభ్యర్థిత్వానికి పరోక్ష సహకారం అందిస్తున్నట్లున్నారు. ఈ రేటుకు ఛైర్మన్ టిక్కెట్ విక్రయించ దానికి లక్ష్మీపార్వతి నిర్ణయిస్తే అందరి ఆశలూ గోవిందే!

కాని రమేష్‌రెడ్డి అంత సులభంగా వదిలే రకం కాదు. ఆయన నేరుగా ఎన్టీఆర్‌ను సంప్రదించి, తన బావమరిది ఆనందరెడ్డికి టిక్కెట్ ఖరారు చేసే ఆలోచనలో వున్నారని వినికిడి. పదిన మాట చెల్లితే రేటు ఎవరు ఎక్కువ పెడితే వారికి; అన్నమాట చెల్లితే రమేష్‌రెడ్డి ఎవరి పేరు చెప్తే వారికి టిక్కెట్ ఖాయం సుబ్బరామిరెడ్డి గారు ప్రతీకారేచ్ఛతో రంగ ప్రవేశం చేసివున్నారు. మొన్న అసెంబ్లీ ఎన్నికల్లో తమకు జరిగిన ఓటమి పరాభవాన్ని త్రిప్పికొట్టడానికి మళ్లీ ప్రసన్నకుమారరెడ్డిని ఛైర్మన్ అభ్యర్థిగా నిలబెట్టాలన్నది ఆయన పంతం. ఎన్ని కోట్లు ఖర్చయినా ఫర్వాలేదు- గెల్చితీరాలి అన్నారట ఆయన.

జనార్ధనరెడ్డి గారి అంత రంగం అంతు బట్టడం లేదు. ఆయన దృష్టి సాధారణంగా ఆనం వివేకానందరెడ్డి పైనే వుండాలి. పార్టీ ఎగుడు దిగుడులలో, వివేకా జనార్ధనరెడ్డినే అనుసరించాడు. నిజానికి జనార్ధనరెడ్డి గారు చేవూరు దేవకుమారరెడ్డి పట్ల సానుభూతి చూపాలి. కాని టౌన్‌లో పార్టీ గెలుపు, అనుసరించి వున్నాడన్న అభిమానం ఆయన్ను వివేకా పట్ల ఆకర్షిస్తున్నట్లున్నాయి. ఏది ఏమైనా జనార్ధనరెడ్డి నిర్ణయమే అభ్యర్థిత్వం విషయంలో ఫైనల్ వర్డ్‌గా వుంటుంది.

తమకు టిక్కెట్ రాకుంటే మాగుంట వర్గం స్వతంత్రంగా రంగంలోకి దిగుతుందా? ఏడాది లోపల పార్లమెంట్ ఎన్నికలు పెట్టుకొని సుబ్బరామిరెడ్డిగారు అంత సాహసం చేస్తారని భావించలేము.

నెల్లూరు మునిసిపాలిటీకి సంబంధించి ఇప్పటికి వున్న పరిస్థితి ఇది! ఒకటిరెండు రోజులలోనే అన్నీ తేటతెల్లం కావచ్చు.

* * *

గూడూరు మునిసిపాలిటీ హరిజన రిజర్వుడు. తెలుగు దేశంలో ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్, మంత్రి ప్రసన్నకుమార్ రెడ్డి, ఎన్సి తదితరుల మధ్య ఇంకా ఒక అవగాహన వచ్చినట్లు లేదు. అభ్యర్థి నిర్ణయం బాధ్యత అధిష్టాన వర్గానికి వదిలేస్తారేమో! గూడూరులో ఎవరి పెత్తనం చెల్లుబాటు కావాలి అనే విషయంలో బల్లి, వైఎస్ఆర్ నల్లపరెడ్ల మధ్య పంతానికి దారితీస్తున్నట్లుంది.

కాంగ్రెస్‌కు సంబంధించి వేమారెడ్డి రామచంద్రారెడ్డి నిష్క్రమణతో అందరూ స్వేచ్ఛ వచ్చినట్లు భావిస్తున్నారు. ఆయన పార్టీలో వుండి వుంటే తనమాటే చలామణీ కావాలని పట్టుబట్టేవారు. ఇప్పుడు ఓడినా, గెల్చినా వేమారెడ్డి వెంకటకృష్ణారెడ్డి, ఎల్లసిరి గోపాలరెడ్డిలకే పెత్తనం. జనార్ధనరెడ్డి గారు వారికా స్వేచ్ఛ ఇచ్చారు.

* * *

కావలి మునిసిపాలిటీపై తన పెత్తనం నిరూపించుకోవడానికి ఓడిపోయిన తెలుగుదేశం అసెంబ్లీ అభ్యర్థి శ్రీ వంటేరు వేణుగోపాలరెడ్డి పట్టుదలగా శ్రమిస్తున్నారు. ఇది గిరిజన మహిళకు రిజర్వు అయిన స్థానం. అభ్యర్థిత్వంపై పెద్దగా పోటీలు లేవు. తెలుగు నాయకులందరూ కలిసి డివిజనంతా గాలించి శ్రీ రామవెంకట రమణమ్మ అనే పట్టభద్రురాలిని గుర్తించారట. ఆమె భర్త బ్యాంకు అధికారి. ఇందుకు వేణు అంగీకరించినట్లున్నారు కాని; కౌన్సిలర్ల ఎంపికలో ఆయనకు, కెవింకె నాయుడులకు మధ్య పేచీలు తప్పేట్లు లేవు. నారాయణ కూడా అసంతృప్తజీవి క్రిందే లెక్క. చివరి గెలుపు తనదేనని వేణు విశ్వాసం.

యానాదిరెడ్డి గారికి మొదటి నుంచీ మునిసిపాలిటీపై పెద్దగా శ్రద్ధ వుండదు. అందులోనూ గిరిజన మహిళ అనే సరికి మరీ నీరసం. ఎక్కడ నుంచి వెతికి తేవాలి అభ్యర్థినిని? బహుశా గ్రంధి యానాదిశెట్టికి వదిలేస్తాడేమో. ఈ బరువు మోయమని!

### నెల్లూరు ముచ్చట్లు

6 పేజీ తరువాయి

12, 14, 15, 22, 26, 27 మహిళలకు 2, 3, 11, 24, 25 కేటాయించారు.

బిసిలకు 1, 6, 9, 17, 23, 28 మహిళలకు 7, 10, 16 ఇచ్చారు.

ఎస్సిలకు 8, 20, 21 మహిళలకు 18, 19 ఎస్టీలకు 13 వార్డును కేటాయించారు.

### ఎయిడ్స్ సెమినార్

నెల్లూరు అమెరికానాస్పత్రిలో 27తేది సోమవారం ఎయిడ్స్ వ్యాధిపై ఒక సదస్సు నిర్వహిస్తున్నారు. చాలా మంది పెద్ద డాక్టర్లు పాల్గొంటున్నారీ సదస్సులో! ఆసక్తి కలిగిన వారిని రమ్మని పిలుస్తున్నారు డాక్టర్ లలిత కుమారి పూలా!

### జిల్లా వార్తలు

5 పేజీ తరువాయి

పరిధిలో 28 కోట్లు వసూలు చేయగా, ఈ యేడు లక్ష్యం పెంచినట్లు వెల్లడించారు. ఒకసారి పన్ను చెల్లిస్తే ఇక జీవితాంతం వారు ఇన్‌కంటాక్స్ రికార్డుల్లోకి ఎక్కి వేధింపులు పడాల్సి వస్తుందనేది అపోహ మాత్రమే నన్నారాయన. ఆదాయం స్థాయి దాటితేనే టాక్స్ చెల్లించాలని, ఒక సంవత్సరం ఆదాయం కల్గి టాక్స్ చెల్లించి నంత మాత్రాన ప్రతి ఏడాదీ చెల్లించాల్సిన రూలేమి లేదన్నారు. సమావేశంలో ఇన్‌కంటాక్స్ అధికారి జి. రవీంద్రనాథ్ రెడ్డి, మునిసిపల్ వైస్ ఛైర్మెన్ గ్రంధి యానాది శెట్టి, పట్టణ బిజెపి అధ్యక్షుడు కె. సత్యనారాయణ తదితరులు పాల్గొన్నారు.

### పంచాంగం

ఫిబ్రవరి తిథులు

మాఘ బహుళ

| | | | |
|---|---|---|---|
| తే 18 శని | తదియ | పా.గం. | 4.07ని |
| తే 19 ఆది | చతుర్థి | ప.గం. | 2.30ని |
| తే 20 సోమ | పంచమి | ప.గం. | 12.40ని |
| తే 21 మంగళ | షష్ఠి | ఉ.గం. | 10.32ని |
| తే 22 బుధ | సప్తమి | ఉ.గం. | 8.17ని |
| తే 23 గురు | అష్టమి | ఉ.గం. | 5.59ని |
| తరువాత | నవమి | రాత్రి | 4.00ని |
| తే 24 శుక్ర | దశమి | రా.గం. | 1.10ని |

స్వయంపాకులు శ్రీనివాసులు., ఎం.ఎ.

# శివారెడ్డి పద్యాలు

## ఆంధ్రముఖ్యమంత్రి

ఎన్టిరామారావు అంటెఆపేరంటె
అదవరానిమోజుఆదినాల్లో
అప్పుడేమైంది నవ్వుబడిపోయింది
రామరాను పరమరహస్యము ఇది!

మంత్రులింతమంది
మటుమాయమైయ్యారో
రాజాలింతమందిరాలిపోయారో!
పరుగులెత్తబాకుపైపైనపడబోకు
పర్మినెంటుగావుపదవులివి!

నిన్నుగూర్చికవితలెన్నైనవ్రాయొచ్చు
తిప్పలొయ్యవచ్చుతీరికుంటె
హెల్త్సప్రాయిల్దైంది ఈమధ్యరానురాన
దెబ్బతిందిబాకీదీర్ఘయింక!

## జిల్లాకలెక్టరు సాంబశివరావు

పేదసాదలన్నప్రేమవాత్సల్యమ్ము
రైతులన్నఅమితప్రీతిశ్రద్ధ
సెప్పగాదెసాంబశివరావు!నినుగూర్చి
నిజముదాస్తె పెద్దనేరమౌర్ధి!
నీదుపాలనల్లోనెల్లూరుదిస్థిక్తు
ప్రాభవమ్ము దానివైభవమ్ము
ఆంధ్రరాష్ట్రమునకు అదిగొప్పగర్వకా
రణమైంది, కొట్లధనమైంది!

## జనవాణి

3 పేజీ కొరవ

పరం చేశాక లాభాలవైపు పయనిస్తున్నది. చిన్న గ్రామాల్లో సైతం బస్సు డిపోలు పెట్టి ప్రజలకు అందుబాటులో వుంటున్నది.

గతంలో కాంగ్రెస్ ప్రభుత్వం నూతన పారిశ్రామిక విధానం పేరుతో ఆల్విన్ వంటి ప్రభుత్వ సంస్థలను ప్రైవేట్ సంస్థలకు అప్పగించడం వల్ల అనేక మంది కార్మికులు ఉపాధి కోల్పోయారు. ప్రజా సంక్షేమం పేరుతో తెలుగు దేశం ఆర్టీసిని ప్రైవేట్ పరంచేయడం చేస్తుంటే రెండు ప్రభుత్వాల తీరూ ఒకటేనని తెలుస్తున్నది. ఇప్పటికైనా ప్రభుత్వం జవాకర్షణ పథకాలకు స్వస్తి చెప్పి ప్రజల కనీస అవసరాలు తీర్చే పథకాలను చేపడితే మంచిది.

నెల్లూరు -వి. యుగంధర్.

### శేషన్‌కు కోర్టు ముక్కుతాడు

ఇటీవల సుప్రీం కోర్టు ఎన్నికల కమీషన్‌పై చేసిన వ్యాఖ్య ఆలోచించ తగ్గది. ఎన్నికలు స్వేచ్ఛగా నిష్పక్షపాతంగా జరిగేలా పర్యవేక్షించే అధికారం ఎన్నికల సంఘానికే వుంటుంది గాని కేవలం ఎన్నికల ప్రధానాధికారికి వుండదనింది. ప్రపంచం లోనే అతి పెద్ద ప్రజాస్వామ్య దేశమైన ఈ దేశంలో ఎన్నికల ప్రక్రియ ఒక వ్యక్తి దయా దాక్షిణ్యాలపై ఆధార పడకూడదన్నది న్యాయమూర్తుల అభిప్రాయ మనుకోవచ్చు. శేషన్ ప్రవర్తనా తీరు వల్ల రాజకీయ పార్టీలతోపాటు ప్రజలూ ఇబ్బందులు పడ్డారు.

ఎన్నికల కమీషన్ బహుళ సభ్య కమీషన్‌గా పనిచేయాలని కేంద్ర ప్రభుత్వం ఇద్దరూ కమీషనర్లను నియమించినా శేషన్ సర్వాధికారాలు చెలాయిస్తూ వచ్చారు. ఇకనైనా ఆయన తన ధోరణి మార్చుకుని సమష్టి నిర్ణయాలు తీసుకుంటారని ఆశిద్దాం.

వెంకటగిరి -కె.నరేష్‌కుమార్.

### నాగేంద్రపురంలో సమస్యలు!

ఆత్మకూరు నాగేంద్రపురంలోని ప్రజలు నిత్యం అనేక సమస్యలు ఎదుర్కొంటున్నారు. వీధిలో నడిచేందుకు సక్రమమైన రోడ్డు లేదు. సిరోజా వీధి దీపాలు వెలగవు. డ్రైనేజి సక్రమంగా కట్టకపోవడంతో ఎక్కడి నీళ్లు అక్కడే ఆగిపోయి వుంటాయి. వంద కుటుంబాలకు పైబడి వున్న ఈ వీధిలో ఒకే మంచి నీటి కొళాయి వుంది. దీనివద్ద ప్రతిరోజూ రచ్చా రావిడే. సోమశిల మునక ప్రాంతీయులుగా ఆరేళ్ల క్రితం నాగేంద్రపురంలో చేరాము. ప్రభుత్వాలు మారుతున్నా మా సమస్యలు పట్టించుకొనే వారే లేరు.

ఆత్మకూరు -బి శ్రీనివాసులురెడ్డి, కరుణ కుమార్‌రెడ్డి -వి.చంద్ర.

### రైల్వేస్టేషన్‌లో ఆటోవాళ్ల దోపిడీ!

నెల్లూరు రైల్వే స్టేషన్‌లో దూర ప్రాంతాలనుండి వచ్చే ప్రయాణీకులను ఆటోవాళ్లు దోచుకుంటున్నారు. ముఖ్యంగా రాత్రివేళ వచ్చే ప్రయాణీకులు నెల్లూరులో ఆటో ఛార్జీలు విని ఆశ్చర్య పోతుంటారు. టౌన్‌లో వివిధ ప్రాంతాలకు ఆటోలు వసూలుచేసే ఛార్జి అంటూ కొత్తగా వచ్చిన ట్రాఫిక్ సిఐ ఒక బోర్డు ఏర్పాటు చేయించారు. అది పదిమందికి కనపడే చోట కాకుండా చాటుగా వుంది. కేవలం ప్రాంతీయ బాషలో మాత్రం దానిపై రేట్లు వ్రాసి వుండడం వల్ల ఎవరికీ వుపయోగ పడడంలేదు. రాత్రివేళల్లో రైల్వేస్టేషన్ వద్ద వుండే కానిస్టేబిల్లు కూడా ఆటోవాళ్లకు సహకరిస్తుంటారు. ఈ విధంగా కాకుండా సిఐ ప్రత్యేక శ్రద్ధవహించి ఆటోరేట్లు ప్రకటించిన బోర్డులో ఇంగ్లీషు, హిందీ భాషలు కూడా చేర్చాలి. దీనికి తోడుగా మామూళ్లలో మునిగి తేలుతున్న తమ శాఖ వారిపై శాఖాపరమైన చర్యలు తీసుకొంటే నెల్లూరు పరువు పరాయిచోట్ల నిలబడుతుంది.

నెల్లూరు -షేక్. నజీర్.

### మునిసిపల్ హెల్త్ ఆఫీసర్ వీధిలో

మునిసిపల్ హెల్త్ ఆఫీసర్ నివాసముండే పెళ్కేమిట్ట ప్రాంతం మురికి కూపంగా మారి వుంది. రోడ్డు ప్రక్కన చెత్త కుప్పలు, డ్రైనేజి కాల్వలను నెలల తరబడి ఊడ్చిన వారు లేరు. పలుచోట్ల డ్రైనేజి నీళ్లు మంచినీటి కొళాయి పైపుల్లోకి ఎక్కుతున్నాయి. విద్యా సంస్థలు వుండే ఈ ప్రాంతం దుస్థితిలో వున్నా ప్రతిరోజూ ఆ దారిలో తిరిగే మునిసిపల్ హెల్త్ ఆఫీసర్‌కు పట్టదు. ఇక టౌనుమీద అయనెంత శ్రద్ధ చూపిస్తాడో ప్రత్యేకంగా చెప్పక్కరలేదు.

నెల్లూరు -పెళ్కేమిట్టవాసులు.

### బియ్యం ఇవ్వాలి!

తెలుగుదేశం ప్రభుత్వం అమలు పరుస్తున్న రెండు రూపాయల కిలో బియ్యం పథకం పేద ప్రజలకు పెద్ద వుపయోగ కారిగా లేదు. పేద కుటుంబాల్లో కనీస కుటుంబ సభ్యుల సంఖ్య ఎనిమిది మందికిపై మాటే. నెలసరి 25 కిలోల బియ్యం ఏమాత్రం సరిపోవు. దీనివల్ల బహిరంగ మార్కెట్‌లో కేజీ బియ్యం 9 రూపాయలు పెట్టి కొనక తప్పడంలేదు. ప్రభుత్వం బియ్యం పథకాన్ని చూపిస్తూ నిత్యావసర వస్తువుల ధరలు పెంచేసే సరికి సామాన్యులపై అదనపు భారం పెరిగి పోయింది. పేదలు కడుపునిండా తిండి తినడానికి వుద్దేశించిన పథకమని డైలాగులు వల్లిస్తుండే అన్నగారు మనిషికి నెలకు 15 కిలోల బియ్యం ఇవ్వాలి.

నెల్లూరు -ఎం. ప్రసాద్.

### జనార్ధనరెడ్డి షష్టిపూర్తి వుత్సవం చేయాలి!

నేదురుమల్లి జనార్ధనరెడ్డికి ఈ ఫిబ్రవరి నెలలో 60ఏండ్లు నిండనున్నాయి. స్వశక్తితో మధ్య తరగతి . కుటుంబం నుండి ముఖ్యమంత్రి పదవిని అలంకరించిన అరుదైన వ్యక్తి. జిల్లాలో తనకంటూ ఒక ప్రత్యేక రాజకీయ శైలి కల్గిన వాడు. అయితే ఇప్పటి వరకు ఎప్పుడూ జన్మదినాలు జరుపు కోకుండా ఆదర్శంగానే వున్నాడు. అటువంటి జనార్ధనరెడ్డి షష్టిపూర్తి వుత్సవాన్ని ఆయన అభిమానులు, కార్యకర్తలు ఘనంగా చేస్తే చూడాలని ఆశ.

నెల్లూరు -టి.వి.నారాయణ.

## సణుగుడు

4 వ పేజీ కొరవ

అదురు పుట్టించాడని, ఓజిలి ట్రాఫిక్ జామ్ సమస్యకు పరిష్కారం వెదికాడని వార్తలు చదువుతుంటే ఉత్సాహం కల్గిన అధికారేనన్పించింది. కాని మొన్నటి సబిన్స్‌పెక్టర్ల బదలీ తీరు తర్వాత ఆయనపై వుండిన సదభిప్రాయాలన్నీ తుడిచి పెట్టుక పోయాయి. ఒకే ఒక్కరోజు 34 మంది సబిన్స్‌పెక్టర్లను తీన్మారు చేసి పారేశారాయన. అదీ చరిత్రలో లేని తీరులో! అందరు ఎస్‌ఐలూ స్టేషన్‌లో అలర్ట్‌గా వుండాలని 10తేది మధ్యాహ్నం నిస్తంత్రీ సందేశం పంపారు. సాయంత్రానికి అందరూ నెల్లూరు చేరాలని మరొక హుకుం జారీ అయింది. అప్పటికి అందరు డిఎస్‌పిలూ ఎస్‌పిగారి సమక్షంలో హాజరైవున్నారు. కొందరు ఎస్‌ఐలు రాత్రి పదిగంటలకు నెల్లూరు చేరారు. అందరూ వచ్చారని నిర్ధారించుకున్న తర్వాత వారిచేతికి బదలీ వుత్తర్వులు ఇచ్చారు. తిరిగి మాట్లాడే అవకాశం ఇవ్వకుండా సంబంధిత డిఎస్‌పిల జీపుల్లో వారిని ఎక్కించి ఆయా స్టేషన్లకు పంపి, రిలీవింగ్, జాయినింగ్ రిపోర్టులు వ్రాయించేశారు. పెళ్లకూరు, ఉదయగిరి వంటి ప్రాంతం ఎస్‌ఐలు వేకువ ఝాము నాలుగు గంటల సమయంలో రిపోర్టులు వ్రాశారట. వాటిమీద టైం మాత్రం రాత్రి 10 గంటలని వేశారట. మధ్యలో వీరు జారిపోతారేమో నని భయపడి దొంగలకు పోలీసులను కాపలా పెట్టినట్లు ఇద్దరు, ముగ్గురు ఎస్‌ఐలకు ఒక సర్కిలిన్స్‌పెక్టర్ లెక్కన కాపలా పెట్టారట.

ఇంత హడావుడి, పకడ్బంది ప్లానింగ్‌కు కారణం - ప్రక్కరోజు- అంటే 11తేది పంచాయితీ ఎన్నికల నోటిఫికేషన్ వెలువడ నుండడం. ఆ నోటిఫికేషన్ విడుదలైతే బదలీలు చేయడానికి లేదు. బదలీలు చేయకుంటే పైన మంత్రిగారు కోప్పడతారు.

నిజానికి మంత్రి శ్రీ నల్లపరెడ్డి ప్రసన్న కుమారరెడ్డి రెండు రోజులకుముందే బదలీల జాబితా తయారుచేసి, హోంమంత్రి ఇంద్రారెడ్డి రాజముద్రిక దానిపై అచ్చొత్తించి, సీల్ కవర్‌లో పెట్టి రాపూరు ఎమ్మెల్యే శ్రీ ఎల్లసిరి శ్రీనివాసులరెడ్డి చేత ఎస్‌పికి పంపారు. అది సకాలంలో చేరి వుంటే ఎస్‌ఐలను అర్ధరాత్రి దొంగలను జైళ్లకు పంపినట్లు స్టేషన్లకు పంపవలసిన అగత్యం ఏర్పడేది కాదు. కాని వైఎస్ ఆర్ పొరపాటున దాన్ని హైదరాబాదులోనే మర్చిపోయి వచ్చాడట. నెల్లూరుకు వచ్చి కలదెలుసుకొని, ఒక ఆర్‌టిసి బస్ డ్రైవర్‌చేత తెప్పించారు. అందుకని ఆలస్యమైంది. పాపం ఎస్‌పి గారు మంత్రిగారి ఆదేశాలకోసం ఎదురుచూసి, చూసి, డ్రైవర్ అందించిన శ్రీముఖాన్ని మనసావాచా కర్మణా ఆచరించారు. తన ఉత్తర్వులను యదాతథంగా అమలు చేసిన ఈ అధికారి స్వామి భక్తికి మంత్రిగారు మురిసి పోయి వుంటారు.

కాని పాలనా పరంగా జరగవలసిన బదలీలను రాజకీయ వాదులు టైప్‌చేసి పంపిన కాగితాల మీద సంతకాలు పెట్టడం ద్వారా జరిపించే దుస్థితికి అధికారులు దిగజారితే పోలీస్ శాఖ ఉనికికి అర్ధం ఏమి వుంటుంది? ఎస్‌ఐలు ఖాకీ చొక్కాలు విప్పి, పచ్చచొక్కాలు తొడుక్కుని తిరగడం తప్ప, తాము జీతం తీసుకుంటున్న పనికి అణుమాత్రం న్యాయం చేయగలరా? రాజకీయ వాదులు బదలీల కోసం సిఫార్సులు చేయవచ్చు. అందులో న్యాయం వుందన్పిస్తే అధికారులు పరిశీలించవచ్చు. అధికారులు రాజకీయ ప్రభావాలకు దూరంగా మడిగట్టుకొని బ్రతకగల్గడం అసాధ్యం. కాని రాజకీయ వాదుల నుంచి డిక్టేషన్ తీసుకొనే స్టెనోలుగా ఐపిఎస్ అధికారులు ప్రవర్తిస్తే; ఎన్నికల నిబంధనలకు విరుద్ధమని తెలిసి, దొంగతనంగా తమ కార్యకలాపాలు నిర్వర్తిస్తే ఐపిఎస్ అధికార్లను సమాజంలో ప్రత్యేక వర్గంగా, ఉన్నతస్థాయి కల్గిన వ్యక్తులుగా పరిగణించడానికి మనసు ఒప్పుతుందా? ప్రజల సొమ్ముతో వారికిచ్చిన శిక్షణ, ప్రజల సొమ్ముతో వారికి ఇస్తున్న జీతాలు, సౌకర్యాలు దండగ కాదా? మంత్రి ఆదేశాల మీద బదలీలైన సబిన్స్‌పెక్టర్లు మంత్రిచెప్తె పనిచేయడం ధర్మంకాని, వారిచేత విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తింపచేసే నైతిక సామర్థ్యం ఎస్‌పి గారికి వుంటుందా?

జాయింట్ కలెక్టరుగారిది మరొక తీరు. ఆయన వచ్చి నాలుగు రోజులే అయింది. క్రిందినుంచి పైకి వచ్చిన వ్యక్తి. ప్రపంచం చూసిన వాడు. అనుభవం వుంది. అయినా ఆయన రాజకీయ నాయకుల పట్ల అవసరానికి మించి భయభక్తులతో, వినయ విధేయతలతో మెలగుతున్నారని రెవిన్యూ ఉద్యోగులలో అసంతృప్తి ప్రబలుతున్నది. మొన్నటి వరకు ఆయన ఇన్‌ఛార్జి కలెక్టరు. మండలాలు, మునిసిపాలిటీల రిజర్వేషన్ల వ్యవహారం ఆయన చేతులమీదుగానే నడిచింది. అన్ని పార్టీల రాజకీయ వాదులూ ఆ సమావేశాలలో ఆయన్ను చులకనగా మాట్లాడారు. మునిసిపల్ రిజర్వేషల మీటింగులో ఒక హరిజన నాయకుడు కలెక్టర్‌పైకి దౌర్జన్యంగా వచ్చి, వేలు చూపించి 'నిన్ను హరిజన అత్యాచారాల క్రింద అరెస్ట్ చేయిస్తా, ప్రాసిక్యూట్ చేయిస్తా' అని బెదరించారు. ఆ దృశ్యం చూసిన వారికి కడుపు మండి పోయింది. జిల్లా కలెక్టర్‌ను పట్టుకొని ఈ రకంగా బెదరించ గల్గుతున్నారంటే ఆ పదవిలో వుండే వ్యక్తిపట్ల ఎంత అలుసు ఏర్పడి వుండాలి? కానీ నాయక్‌గారు మాత్రం నన్ను కాదన్నట్లు వుండిపోయారు. కలెక్టర్‌ను బెదరిస్తేనే ఏమీ చర్యలేదని అర్ధమైతే తాలూకాఫీసులోనో, మరొక కార్యాలయంలోనో పనిచేసే సాధారణ రెవిన్యూ వుద్యోగికి చీపుర పుల్ల విలువ మిగులుతుందా? ఇప్పటికే కొందరు తెలుగు ఎమ్మెల్యేలు ఎమ్మార్వోలను కూడా తమ బంట్రోతుల క్రింద భావిస్తున్నారు. కలెక్టర్ గారు వారికి మరీ అలుసు ఇస్తే రేపటి నుంచి ఎమ్మెల్యే బంట్రోతు కూడా ఎమ్మార్వోను దబాయించేస్తాడు.

బెంగుళూరులో ఈమధ్య అమాయక రోగులు జ్వరం వచ్చిందని ఆస్పత్రికి వెళ్తే పొట్టకోసి కిడ్నీ పెరికేస్తున్నారట. ఆ వైద్య శిఖామణులను సంప్రదించి నెల్లూరు ఎస్‌పి గారికి ఒక వెన్నెముక, జాయింట్ కలెక్టర్‌గారికి ఒక గుండెకాయ గిఫ్ట్‌గా ఇస్తే బాగుంటుందేమో ఆలోచించండి!

## షేర్లు

2 పేజీ కొరవ

రూపాయల లాభం రావచ్చు. నష్టం వచ్చే పరిస్థితి లేదు.

### ఫెడరల్ బ్యాంకు

ఇది కూడా మౌలికంగా దృఢమైన షేరు. కేరళ ప్రధాన స్థావరంగా పని చేసే ఈ బ్యాంకులో, ప్రాంతీయాభిమానంతో కేరళీయులు దేశంలో ఎక్కడున్నా తమ డిపాజిట్లు చేస్తుంటారు. విదేశాలలో వుండే కేరళీయులు దాదాపు లక్ష మంది ఇందులో డిపాజిట్లు చేసి వున్నారని అంచనా. 94 సెప్టెంబరు నాటికి ఈ బ్యాంకు రు 19 కోట్ల లాభం ఆర్జించింది. మార్చి అంతానికి అది రు. 25 కోట్లకు పెరుగు తుందని అంచనా. ఐపిఎస్ రు 28 లు. ప్రస్తుతం 255 నుంచి 265 ల మధ్య షేరు లభిస్తున్నాయి. మే నాటికి రు. 320 నుంచి 350 లు వరకు పెరిగే అవకాశం వుంది. గత మూడు నెలల నుంచి ఈ షేరు ధర ఏ మాత్రం తగ్గ లేదు. పెట్టుబడికి నష్టం రావడం వుండదు.

- డాక్టర్ డి.పి.

# అమితాబ్‌బచన్‌కు ఒక్క సినిమాకు 3 కోట్లు!

ఒకప్పుడు అమితాబ్ బచన్‌కు 10 లక్షలు ఇచ్చారంటే, అబ్బో అనుకునే వారు. ఇప్పుడు డబ్బుకు హిందీ ఫిల్ములో విలువే లేదు. మాధురీ దీక్షిత్ 50 లక్షలు, నానాపటేకర్ 50 లక్షలు, జూహిచావ్లా 20 లక్షలు, రవీనా టాండన్, కరిష్మా కపూర్, మనీషా కోయిరాలాలు 15 లక్షలు, అజయ్ దేవగన్ 70, సన్నీడియోల్ 15, మిధున్ చక్రవర్తి 40, అక్షయ్ కుమార్ 30 లక్షలు తీసుకుంటున్నారు. అమితాబ్ బచన్ ఒక చిత్రంలో నటించడానికి ఇటీవలే 3 కోట్లు అడిగారట.

**హిందీ ఫీల్డులో డబ్బుకు విలువే లేదు!**

## నమోదు చేయబడిన చిత్రాల పేర్లు

బ్రాంది షాపుల వాళ్ళల్లో కొందరి దృష్టి సినిమా మీద పడింది. విస్కీలు, బ్రాందీలో వచ్చే లాభాల్లో ఎక్కువ శాతం సినిమాల నుంచి సంపాదించ వచ్చుని కొందరు ఆశపెట్టారు. ఫలితంగా ఇటీవల నమోదు చేయబడిన చిత్రాల సంఖ్య ఎక్కువైంది.

మౌనికా క్రియేషన్స్ "ఆశ". శ్రీ తులసి అన్నపూర్ణ క్రియేషన్స్ "ఆయనకిద్దరు", సుమంత్ ప్రొడక్షన్స్ "అంజనీ పుత్రుడు", వైజయంతి మూవీస్ "భూలోక వీరుడు", సూపర్‌హిట్ మూవీ మేకర్స్ "కమాండో", ఈశ్వర సాయి క్రియేషన్స్ "దేవతలే ఇల్లాళ్లు", యువ ఆర్ట్ మూవీస్ "ఈ నాటి చింతామణి", శ్రీరాం క్రియేషన్స్ "హల్లో లైలా", టి.వి.ఎస్. ఆర్ట్ క్రియేషన్స్ "జనకమహారాజా", పెద్దమ్మ ఆర్ట్ క్రియేషన్స్ "మేడ్ ఫర్ ఈచ్ అదర్", అనూరాధ ఫిలిమ్స్ "మగసింహం", భారతి పిక్చర్స్ "మంత్రిగారి మొగుడు", మహేష్ మూవీ క్రియేషన్స్ "మాయమహల్", గిరిజా మూవీస్ "మేఘమాల", మానసా ఆర్ట్ క్రియేషన్స్ "మిస్టర్ ఆంధ్ర", వాణి ఆర్ట్ క్రియేషన్స్ "నీలి మేఘాలు", శ్రీ సాయిరోజా ప్రొడక్షన్స్ "శివంగి", శ్రీ పద్మావతి క్రియేషన్స్ "ఎర్ర సూర్యుడు", ఉదయసూర్య మూవీస్ "అగ్ని శిఖరం", కరుణాలయా కళాకేంద్ర "అఖండ విజయం", జి.బి. ఫిలిమ్స్ "జమీందారు తీర్పు", ఓం శివసాయి ఫిలిమ్స్ "మొనగాడు",

# జంధ్యాలవంద నవ్వుల విందు !

జంధ్యాల రచన, దర్శకత్వంలో తయారైన చిత్రాన్ని పై పేరున విడుదల చేయడానికి సన్నాహాలు చేస్తున్నారు. "ఏ సినిమా అయినా సమస్యల్ని ఎత్తి చూపుతుంది. పరిష్కార మార్గం సూచించలేదు. ఇదీ అలాంటిదే. ఆడపిల్ల వివాహం సమస్యను కాస్త హాస్యం జోడించి ప్రజల ముందుంచుతున్నా" అన్నారు జంధ్యాల. త్వరలో విడుదలయ్యే ఈ చిత్రంలో రాజేంద్ర ప్రసాద్, ఐశ్వర్య, కోట శ్రీనివాసరావు, బ్రహ్మానందం, ధర్మవరపు, వేలు, శుభలేఖ సుధాకర్, గుంటూరు శాస్త్రి, నాగరాజారావు, ఐరన్‌లెగ్ శాస్త్రి, విజయలక్ష్మి నటించారు.

## కన్నడ చిత్రాల డబ్బింగ్ రైట్స్ పెరుగుదల

గతంలో కన్నడ చిత్రాల డబ్బింగ్ రైట్స్ చిత్రాల రేటు లక్ష, రెండున్నర లక్షలకు మించి ఉండేది కాదు. కానీ, ఒక్క సంవత్సరంలోనే అవి పది రెట్లు పెరిగాయి. 30శాతం అనువాదపు హక్కుల ద్వారా కన్నడ చిత్ర నిర్మాతలకు ముందే లభించేస్తోంది. పెద్ద తారల చిత్రాలు సైతం ఫెయిల్యూర్ అవడంతో తెలుగు నిర్మాతలు, కొనుగోలు దారులు పరభాషా చిత్రాలు తెనిగించేందుకు పోటీలు పడడంతో ఆ పరభాషా నిర్మాతలకు ఎంతో ఉత్సాహంగా వుంది. ముఖ్యంగా కన్నడ చిత్ర నిర్మాతలకు! కాని, తెలుగు నుంచి కన్నడానికి ఒక్క చిత్రం కూడా విడుదల అవడానికి వీల్లేదు. కన్నడ చిత్రాభిమానులు అందుకు అనుమతించరు. వాళ్ళ భాషాభిమానం అంత గొప్పది. కాని, కన్నడ చిత్రాలు

**మద్రాసు సినిమా వార్తలు**

అనువదిస్తే మన ప్రేక్షకులు విరగబడి చూస్తారు. ఇది మన ప్రేక్షకుల అభిమానం.

## "చిన్న పెద్ద తేడా ఏమీ లేదు"

"ఆర్టిస్టులకిచ్చే రెమ్యూనరేషన్‌లలో తప్ప చిన్న చిత్రానికి, పెద్ద చిత్రానికి ఈ రోజు అట్టే తేడా ఉండడం లేదు" అన్నారు 'కేటు - డూప్లికేటు' చిత్ర నిర్మాత కె.సి. రెడ్డి!

కొరవ 11 పేజీలో

**ప్రేక్షకుల సహనాన్ని పరీక్షించే ప్రేమ కథా చిత్రం**

# కొండపల్లి రత్తయ్య

భారతీయ సినిమా రంగంలో 'ప్రేమ' కథాంశం ఎల్లప్పుడూ నిత్య నూతనమే. కొన్ని వేల సినిమాల్లో వందలాది మంది దర్శకులు ప్రేమను విభిన్న కోణాల్లో చూపి ప్రేక్షకుల మన్ననలు పొందారు. ఒకప్పటి ట్రెండ్ సెట్టర్ దాసరి నారాయణరావు కూడా పలు ప్రేమ కథలు తీసి గతంలో పేరు గడించారు. కాని సురేష్ ప్రొడక్షన్ అధినేత రామానాయుడు తన దర్శకత్వంలోనే తీసిన తాజా చిత్రం 'కొండపల్లి రత్తయ్య' ను మాత్రం ప్రతిభావంతంగా తీయలేక పోయారు. కథ పాత చింతకాయ తొక్కు కావడం, కథనంలో నవ్యత లేక పోవడంతో చిత్రం నీరు గారి పోయింది. సినిమా చూస్తున్న ప్రేక్షకునికి సన్ని వేశాలన్నీ ఏదో సినిమాలో చూసినట్లనిపిస్తాయి. అదిగాక చిత్రాన్ని సాగదీయడం ప్రేక్షకుల సహనాన్ని పరీక్షించింది. ప్రేమకథా చిత్రాలకు ప్రాణంపోసేది సంగీతం. చిన్నారి సంగీత దర్శకులు శ్రీలేఖ ప్రయత్నంలో అపరి పక్వత కనపడింది. అందువల్లే పాటలన్నీ విన్న వెంటనే మరచి పోతారు. అయితే ఫోటో. కె. నాయుడు కెమెరా ప్రకృతిలోని అందాలను రమణీయంగా చిత్రీకరించడాన్ని చూడను మాత్రం మనస్సు వువ్విళ్లూరుతుంది. ఎం.వి.ఎస్. హరనాధరావు మాటల్లో

**అల్లూరు రహీం**

వాడి వేడి తగ్గి చిత్రానికి మరింత వెలితిని తెచ్చి పెట్టాయి. దాసరి నారాయణరావు ఎప్పటి నుంచో గొప్ప పాత్రగా చెప్పుకున్న 'కొండపల్లి రత్తయ్య' చిత్రానికి డొక్కు కథనాన్ని తమిళ రచయిత పిసి గహనాథన్ అందించి ప్రేక్షకులకు ప్రేమ కథా చిత్రాల పట్ల వుండే మక్కువను చంపాడు.

చిత్ర కథను పరికిస్తే రత్తయ్య (దాసరి నారాయణరావు) మాటంటే కొండపల్లిలో ఎదురుండదు. అందరికీ ఆమోద యోగ్యమైన న్యాయాన్ని అమలు చేస్తుంటాడు. పట్టణం నుండి కొండపల్లికి హాలిడే ట్రిప్ కొస్తారు అక్కా తమ్ముళ్లలైన శ్రీదేవి (ఆమని) శ్రీధర్ (హరీష్). శ్రీదేవి కి సహజంగానే తలపొగరెక్కువ. రత్తయ్య కూతురు సీత (సురభి) తో అనవసరంగా తగవు పెట్టుకుంటుంది. కాని శ్రీధర్ తొలిచూపులోనే సీతను ప్రేమించ నారంభిస్తాడు. గ్రామంలో ఒక తీర్పు చెప్పే సమయంలో శ్రీదేవి రత్తయ్యకు ఎదురు తిరగడంతో ఆమెకు శిక్ష విధించడంతో ఆమె తోక తొక్కిన త్రాచు అవుతుంది. రత్తయ్యను దెబ్బకొట్టను సీతను ఎరగా వాడుకోవాలని తలుస్తుంది. టెంకాయ నీళ్లలో మత్తు మాత్రలు కలిపి సీతపై అభాండం వేస్తుంది. కాని అది తిరగ బడి శ్రీధర్‌కు సీతను ప్రేమిస్తున్న విషయం బహిరంగంగా చెప్పే ఛాన్సు దొరుకుతుంది. కాని అందరి పెళ్లిళ్లకు ఆమోదం తెలిపే రత్తయ్య తన కూతురు పెళ్ళికి ఒప్పుకోక ఆమెను చంపివేయమని తన అనుచరుడ్ని (చలపతిరావు)కి దుతాడు.

రత్తయ్య ఆ నిర్ణయం తీసుకోవడం వెనుక మరో వ్యధా పూరిత కథ దాగుంటుంది. కృష్ణమూర్తి (గొకిన రామారావు) కొండపల్లికి ఒకప్పుడు పెద కామందు. అతని తమ్ముడు సాయికృష్ణ (రాఘవ) రత్తయ్య మరదల్ని ప్రేమించి వంచిస్తాడు. ఆమె మరణంతో ఉగ్రుడైన రత్తయ్య కృష్ణమూర్తి తమ్ముళ్లను అంతమొందిస్తాడు. ఈ సంఘటన గ్రామాన్ని రెండు వర్గాలుగా

కొరవ 11 పేజీలో

నెల్లూరు జిల్లా వర్కింగ్ జర్నలిస్ట్‌ల సభలో జాయింట్ కలెక్టర్ ఎం.ఆర్. నాయక్, రాష్ట్ర అధ్యక్షుడు అంబటి అంజనేయులు కార్యదర్శి నాగేష్ కుమార్

## నెల్లూరు సంగతులు

4 పేజీ తరువాయి

ఆజ్యం పోసింది. 'ఈనాడు' నుండి వెలుపలికి వచ్చిన ఒక విలేఖరి 'ఈనాడు'లో వుంటున్న కంట్రిబ్యూటర్‌ను కొట్టాడంటూ ఆవర్గం రెచ్చి పోయింది. పాత్రికేయులు ఎవరికి వారే స్వతంత్రులు కావడంతో ఏ ఒక్కరూ ఎవర్నీ నిలువ రించ లేక పోయారు. రాష్ట్ర నాయకుల మాట పట్టించుకోక పోవడంతో, ఎన్నికలను నిరవధికంగా వాయిదా వేస్తున్నట్లు ప్రకటించి వారు పారిపోయారు. దీనితో ఏ వర్గానికి ఆ వర్గం వేరు వేరుగా బయటకు దారి తీసారు.

ఎన్నికల ముందు జరిగిన వార్షిక సమావేశానికి జిల్లా ఇన్‌ఛార్జ్ కలెక్టర్ ఎం.ఆర్. నాయక్ ఆంధ్రప్రదేశ్ వర్కింగ్ జర్నలిస్ట్ యూనియన్ రాష్ట్ర అధ్యక్ష కార్యదర్శులు ఎ. అంజనేయులు, ఎన్. నాగేష్ కుమార్ ముఖ్య అతిధులుగా విచ్చేశారు. యూనియన్ రీజినల్ కార్యదర్శి నాగిరెడ్డి, జిల్లాయూనియన్ ఇన్‌ఛార్జి అధ్యక్షులు ఆర్. ఎం. ఎస్. ప్రకాశ్ బాబు, కార్యదర్శి కె.బి. రామ్మోహన్ వేదిక నలంకరించారు.

### ప్రకటన

ఈ క్రింది షెడ్యూలు దాఖలా ఇల్లు స్థలమున్నూ కొనుగోలు చేయుటకు విన్నకోట లక్ష్మిప్రసాదు గారి భార్య విన్నకోట హేమ వద్ద 4.1.95 తేదిన విక్రయ అగ్రిమెంటు వ్రాయించుకొని యున్నాను. సదరు ఆస్తికి సంబంధించిన అసలు రిజిష్టరు విక్రయ పత్రం అనగా బి. కళ్యాణమ్మ వద్ద వల్లి శివలక్ష్మి నారాయణ 24.6.93 న కొనుగోలు చేసిన విక్రయ పత్రం (Doct No. 2879/93, నెల్లూరు రిజిష్టారు ఆఫీసు) పోయినదనియూ కనబడ లేదని చెప్పినారు. సదరు విక్రయ పత్రము అసలు ఎవరి వద్దనైన ఉన్న ఎడలగాని సదరు పత్రములో ఉదహరించిన ఆస్తి పై ఎట్టి హక్కు ఉన్న గాని ఈ ప్రకటన వెలువడిన తర్వాత 15 రోజాలలో రిజిష్టరు పోస్టు ద్వారా ఈ క్రింది చిరునామాకు తెలుపవలెను.

**షెడ్యూలు**

నెల్లూరు రంగనాయకుల పేట అనకట్ట రోడ్డు వార్డు నంబరు 8 Old D. No. 155 New D.No. 209 గల మిద్దె ఇల్లు ఖాళీ స్థలమునకు హద్దులు.

తూ: అనకట్ట రోడ్డు; ద: కోమండూరు వత్సలమ్మ ఇల్లు; ప: పిటిపోర్టు కట్ట; ఉ: సందు దారి.

ఎస్. భవాని
W18/362, ఆచారి వీధి, నెల్లూరు

### ముచ్చటగా ముగిసిన కవిత్రయ జయంత్యుత్సవాలు!

11,12,13 తేదుల్లో టౌన్‌హాల్‌లో జరిగిన కవిత్రయ జయంత్యుత్సవాలు ముచ్చటగా ముగిశాయి. సహజంగానే జయంత్యుత్సవాలకు వుండే క్రేజ్‌వల్ల సాహితీ అభిమానులు విరివిగా విచ్చేశారు. 12తేది వసుచరిత్రపై డాక్టర్ శ్రీమతి సుజాతా రెడ్డి చేసిన ప్రసంగం మూడు రోజుల కార్యక్రమంలో హైలెట్‌గా నిలిచింది ప్రతిరోజా సభా ప్రారంభానికి ముందు సాయికుమార్, మైథిలి, స్వరాజ్యం, లీలాలక్ష్మి శ్రావ్యమైన కీర్తనలను ఆలపిస్తూ ఆహూతులను తన్మయులను చేశారు.

జయంత్యుత్సవాలను సాహితీ వేత్త డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి ప్రారంభించి మాట్లాడారు. వేటూరి ప్రభాకర శాస్త్రి సాహిత్య విమర్శ, గ్రంథ పరిష్కరణాలతో ఘనాపాటని చెబుతూ కవిత్రయ జయంతులు నాటి నుండి నేటి వరకు ఎలా నిర్వహింప బడినవో వివరించారు. కవిత్రయ అవార్డును తన చేతుల మీదుగా వేటూరి ఆనంద మూర్తికి అందించారు. వేటూరి ప్రభాకర శాస్త్రి సాహిత్య సేవను తొలి రోజా సభలో ఆనందమూర్తి వివరించారు. మల్లంపల్లి సోమశేఖర శర్మ 'రెడ్డికింగ్‌డమ్' రచనకు శాస్త్రి గారి ప్రోత్సాహమే కారణమన్నారు. తంజావూరు, మద్రాసు ప్రాచ్యలిఖిత పరిశోధనాలయాలకు సంచాలకులుగా వుండి అపూర్వ సాహిత్య సేవచేసినట్లు చెప్పారు. శాస్త్రిగారు శతావధాని, అష్టావధానులని వైద్య, యోగ శాస్త్రాలలో నిష్ణాతులని, చాటువులన్నింటినీ సేకరించి చాటు పద్యమణి మంజరి వ్రాశారన్నారాయన.

రెండవ రోజా సభలో కవిత్రయ జయంతి సంఘం కార్యదర్శి గోసుకొండ వెంకట సుబ్బయ్య వుస్మానియా యూనివర్శిటీ తెలుగు లెక్చరర్ డాక్టర్ శ్రీమతి సుజాతారెడ్డిని సభకు పరిచయం చేశారు. అధ్యక్షించిన రిటైర్డ్ జిల్లా జడ్జి కె.పి. నారాయణరావు ప్రబంధ యుగంలో వసు చరిత్రకుగల స్థానాన్ని విశ్లేషించారు. వక్త డాక్టర్ సుజాతా రెడ్డి వసుచరిత్రపై ఆసక్తిదాయకంగా మాట్లాడారు. అలంకార శాస్త్రం చదివినవారే వసు చరిత్రను అర్థం చేసుకోగలరని, ప్రబంధ శైలి వసుచరిత్రలో ఉన్నత శిఖరాలు అందుకొన్న దన్నారు. మను-వసు చరిత్రల తులనాత్మక పరిశీలన చేస్తూ వరూధినీ ప్రవరులు శుక్తిమతీ కోలాహలుల పాత్ర చిత్రణలో వున్న సౌమ్య వైషమ్యాలను విశదీకరించారు. వనవిహారం, జలక్రీడ, చంద్రోదయాది వర్ణనలలో రామరాజ భూషణుడు మను చరిత్ర క్రమంలో విశదం చేసి అందులేని సంగీతశ్లేష అలంకార వైచిత్రిని అదనంగా ప్రదర్శించడం వల్ల గురువును మించిన శిష్యుడైనట్లు చెప్పారామె. ప్రవర శుక్తిమతులలో వరూధినీ కోలాహలులలో వారి స్వభావ చిత్రణలను నిరూపిస్తూ ప్రకృతా ప్రకృత శ్లేషను, శబ్దభక్తి మూలక అలంకార ధ్వనిని చక్కగా విశ్లేషించి డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి చేతుల మీదుగా అవార్డ్ అందుకొన్నారు.

చివరిరోజా సభకు అగస్త్యరెడ్డి వెంకురెడ్డి అధ్యక్షులు. వుపన్యాసకులు డాక్టర్ వుడాలి నరసింహశాస్త్రి బి.వి. నరసింహాలు పరిచయం చేశారు. అగస్త్యరెడ్డి వెంకురెడ్డి ద్విపద భారత ప్రశక్తి దాని చారిత్రక నేపథ్యాన్ని గూర్చి వివరంగా చెప్పారు. నరసింహశాస్త్రి మాట్లాడుతూ ద్విపద యొక్క పూర్వరూపం గేయరూపంగా ఆటవిక జానపదుల్లో స్థానం చేసుకొన్నదనీ; తరువాత క్రమంగా యక్షగాన శతక జానపద సాహిత్యాలలో ద్విపద రూపంగా మారిందన్నారు. సాహితీ సభల్లో పాల్గొన్న వారందరికీ మూడురోజాలు కృతజ్ఞతలను ఆవిష్కరిస్తూ వర్ధమాన సమాజం కార్యదర్శి బి.వి. నరసింహాలు వందన సమర్పణ చేశారు.

### కేంద్రప్రభుత్వ సదుద్దేశం-రాష్ట్రప్రభుత్వ దురుద్దేశం!

కేంద్ర ప్రభుత్వం ఎంతో సదుద్దేశంతో చేసిన నూతన పంచాయితీ రాజ్ చట్టాన్ని రాష్ట్ర ప్రభుత్వం అధికార బలంతో నీరు కారుస్తోందని ఆరుగురు కాంగ్రెస్ నాయకులు ధ్వజమెత్తారు. 12తేది ఇందిరా భవన్‌లో విలేకరులతో మాట్లాడుతూ రిజర్వేషన్లు, ప్రాదేశిక నియోజక వర్గాల విభజనల్లో అధికారులు తెలుగుదేశం పార్టీకి తొత్తులుగా వ్యవహరిస్తున్నట్లు చెప్పారు. అసెంబ్లీ ఎన్నికలు, మునిసిపల్ ఎన్నికలకు మధ్య 40వేల మంది ఓటర్లు అదనంగా ఏవిధంగా పెరుగుతారని ప్రశ్నించారు. తెలుగు దేశం నాయకులు ప్రాదేశిక నియోజక వర్గాల విభజనల్లో అధికార దుర్వినియోగానికి పాల్పడి తమకు అనుకూల మైనచోట రెండు వేల మంది జనాభాతో నియోజక వర్గాన్ని ఏర్పరచి వ్యతిరేక మైన చోట ఆరు వేలకు పైగా జనాభా చేర్చారని చెప్పారు. 10 తేది ఎన్నికల నోటిఫికేషన్ విడుదల చేయాల్సి వుండగా తొమ్మిదోతేది అర్ధరాత్రి పోలీసు అధికారులను బదలీ వేటుకు గురిచేసిన ఘనత దేశం నాయకులకు దక్కిందన్నారు. ఎన్నికలను న్యాయబద్ధంగా జరిపించాల్సిన ఎస్‌పి, జిల్లా ఇన్‌ఛార్జి కలెక్టర్‌ల ప్రవర్తన చూస్తుంటే వారే ఓట్లు వేసేట్లున్నారని ఎద్దేవాచేస్తు అధికారులు నియమావళికి నీళ్లు వదలి జనాభా వివరాలు ముందు ప్రకటించ లేదన్నారు. గెలిచిన ఎమ్మెల్యేలు అభివృద్ధి విషయం మాట్లాడగ పోగా కాంగ్రెస్ హయాంలో చేపట్టిన పనులకు ప్రారంభోత్స చేస్తున్నట్లు చెప్పారు. సమావేశంలో ఆనం సంజీవరెడ్డి, రామనారాయణరెడ్డి, సివి శేషారెడ్డి, పవాలు పట్రా ప్రకాశరావు, చేవూరి దేవకుమార్‌రెడ్డి నెదురుమల్లి పద్మనాభరెడ్డి పాల్గొన్నారు.

### సాహితీ సార్వభౌముడు శ్రీకృష్ణ దేవరాయలు!

శ్రీకృష్ణదేవరాయ జయంతి సభ టౌన్‌హాల్‌లో వర్ధమాన సమాజ యాజమాన్యాన ఇటీవల జరిగింది. కళా ప్రపూర్ణ మరుపూరు కోదండరామిరెడ్డి అధ్యక్షత వహించి మాట్లాడారు. దక్షిణ భారత దేశంలో కృష్ణదేవరాయలు సువిశాలమైన సామ్రాజ్యాన్ని స్థాపించి రాజకీయ సుస్థిరతతోపాటు ఆంధ్ర సాహిత్య వైభవానికి అవిరళ కృషి చేసినట్లు చెప్పారు. అప్పకవి పుణ్యమా అంటూ ఆముక్త మాల్యద రచించిన కవి- రాయలా పెద్దనామాత్యుడా అనే సందేహ మేర్పడింది. కాని కావ్య పరిశీలన చేసిన వారికి కృష్ణ దేవరాయులుకాక మరెవ్వరూ ఇంత గంభీర రచన చేయలేరని తెలిసినట్లుచెప్పారాయన. రాజకీయ చతురతలో దేశ క్షేమానికి రచనా నైపుణ్యంతో కావ్యరచన చేసి సాహితీ సమరాంగణ సార్వభౌముడని ప్రశంసించారాయన. వుస్మానియా విశ్వవిద్యాలయం ఆంధ్రోపన్యాసకులు ఉత్పల సత్యనారాయణా చార్యులు రాయల నాటి సామాజిక జీవన విశేషాలపై కూలంకషంగా ప్రసంగించారు. సమగ్ర దర్శనశక్తి -రచనా దక్షత గల మహాకవి మాత్రమే చిరకాలం కవిలోకంలో నిలువ గలుగుతారన్నారు. కృష్ణరాయలు రచనలో అడుగడుగునా అనాటి ప్రజాజీవనం కళ్లకు కట్టినట్లు కనపడు తుంది. ఆంధ్ర ప్రబంధాలలో ఋతువర్ణనలు అనితర సాధారణంగా చేసింది రాయలు ఒక్కరేనని ముగించారాయన.

సభాపోషకులు చల్లా గుండ్ల రామచంద్రయ్య తన జననీ జనకుల స్మృత్యంకంగా అతిధులను వుచితరీతిన సమ్మానించారు. సభా ప్రారంభంలో ప్రభుత్వ సంగీత నృత్య కళాశాల విద్యార్థినులు వరలక్ష్మి, రాజ్యలక్ష్మి, సౌజన్య, అనూరాధ, సావిత్రి మధుర గీతాలాపన చేశారు. వర్ధమాన సమాజ కార్యదర్శి బి.వి. నరసింహాలు స్వాగత కృతజ్ఞతా వచనాలు పలికారు.

### అవోపా కొత్త కార్యవర్గం

ఆర్యవైశ్య అఫిషియల్ అండ్ ప్రొఫెషనల్స్ అసోసియేషన్ 12 తేది ఆచారి వీధిలోని ది క్లాత్ మర్చంట్స్ అసోసియేషన్ హాలులో సమావేశమై నూతన కార్యవర్గాన్ని ఎన్నుకొన్నది. అధ్యక్షునిగా జి.ఆర్. కృష్ణమూర్తి, ఉపాధ్యక్షులుగా నీలాకట్టి చెన్నయ్య, ఎం.సి. కళాధర్, ఆర్.పి. సుబ్బారావు, కార్యదర్శులుగా కె. సత్యనారాయణ, ఎన్. వెంకయ్య, ఎం.పి. అంజనేయులు, జి. లక్ష్మి నారాయణ, కోశాధికారిగా ఎం. రాధాకృష్ణ ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. కాని జనరల్ సెక్రటరీ పదవికి పోటీ అనివార్య మైంది. పోటీలో ఏసివి ప్రసాద్ గెలుపొందారు. ఎన్నికల అధికారిగా బి. వెంకట సుబ్బయ్య వ్యవహరించారు.

### 50 ఏళ్లక్రితం

3 వపేజీ తరువాయి

| | |
|---|---|
| పల్లి పెసర | 18 0 0 |
| మిర్చికాయలు వీ1క. | 1- 8- 0 |
| చింతపండు వీ1క | 0 14 0 |
| వెండి, బంగారు ధరలు | |
| సవర 1క | 49-4- 0 |
| సవరయెత్తు బంగారు | 45-5- 0 |
| వెండి రూపాయి ఎత్తు | 1-5- 0 |

-విమర్శకుడు.

### నాటకాల పురాణం

8తేది బిట్రగుంటలో సావిత్రి. గగ్గయ్య యమరూపంతో బండిదిగేటప్పటికి, దూతరూపంతో పెలిగ్రాము, మనిషి ప్రత్యక్షం యముని గృహంలో బిడ్డకు జబ్బుని. నాటక మెట్లన్నాపోనీ యింటికి వెళ్తానంటాడు యముడు. అయ్యో బాబో నష్టపడి పోతానంటాడు కంట్రాక్టరు. చివరకు 30రూ. హెచ్చింపుతో, అంటే రూ.230 లతో యముడు రంగు పూశాడు. తక్కిన యాక్టర్లంతా మూడో నెంబరు తల్లిస్తు ఐదోనంబరు. అడియన్సు బూతులు తిట్టడంలో ఫస్టు నెంబరు. నాటకం యెట్లున్నా రు.300 లు లాభంతో కంట్రాక్టరు బైట పడ్డారు. కాంబినేషన్ లేదు. రిహార్సల్ లేదు. పాటలేదు. పద్యంలేదు. ఆట్నే యేమి నాటకమండీ?

* * *

9తేది నెల్లూరు కొత్తహాల్లో కురుక్షేత్రయుద్ధం. అదే సత్య, మొగ కృష్ణుడుగా మారినందున కంట్రాక్టరు రు.500లు దెబ్బతిన్నారు. ఒక్క దుర్యోధనుడు మాధవపెద్ది వెంకట్రామయ్య తప్పితే తక్కిందల్లా హుళక్కి. సూరిబాబు ముఖంలో భావం వుండదు గాని, సంగీతంలో? నాటక ఘనఘోంతరాళాలు తద్దరిల్లిపోతవి మధుర ధ్వనితో.

* * *

11తేది పొదలకూరులో శివరాత్రికి రాయబారం అంతా అపూరి నటకులే. నూరు రూపాయలు నష్టమైనా శివరాత్రి జాగారం జరిగింది.

* * *

## వెండినాణాలు

4 పేజీ తరువాయి

ఒక్క పేయని రూఢిగా చెప్పలేము. ఒకవేళ ఇదే ఆ పావత్రి అయితే ఇది ఒక వర్తక కేంద్రంగా వెలుగొందిందని చెప్పవచ్చు.

### ఆర్మోగాన్

ఇది రెడ్డిపాళానికి దగ్గరలో వున్న మోనపాళెం అనే గ్రామం వద్ద వుంది. బ్రిటీష్ వారు కోస్తా తీరంలో వర్తక స్థావరాలను ఏర్పాటు చేసుకునేటప్పుడు ఇక్కడ స్థానికుడైన 'ఆర్మగం' అనే కరణం చంద్రగిరి రాజుల వద్ద నుండి అనుమతి పత్రం తెచ్చివ్వారని, అందువల్ల అతని జ్ఞాపకార్థం ఈ ప్రదేశానికి ఆర్మోగాన్ అనే పేరు వచ్చిందని వాడుకలో వుంది. అయితే ఇంగ్లీషు వర్తకులు ఈ ప్రదేశానికి రాకముందే దానికి ఆర్మోగాన్ అనే పేరు వచ్చిందని బ్రిటీష్ వారి రికార్డుల వల్ల తెలుస్తున్నదని డాక్టర్ ఎం. పట్టాభిరామిరెడ్డి తెలిపారు.

ఇంగ్లీషువారు క్రీ.శ. 1626 మార్చి 1 న ఇక్కడి స్థావరంలో ప్రవేశించారు. 1628 లో మచిలీపట్నంలో వ్యాపార కేంద్రాన్ని మూసివేసి దాన్ని ఆర్మోగాన్‌కి మార్చారు. అయితే వారు ఆశించిన రీతిలో వ్యాపారం జరగక పోవడం వల్ల డచ్‌వారి నుండి పోటీ అధికంగా ఉండడం వల్ల స్థానిక నాయకుల సహకారం లేకపోవడం వల్ల 1640 ఫిబ్రవరి 20 న ఆర్మోగాన్ కోటను మూసివేసి మద్రాసు పట్టణంలో చేరారు. పిదప కొంత కాలం ఇది డచ్ వారి కేంద్రంగా పనిచేసింది.

### పులికాట్

పులికాట్ సరస్సు పరిసర ప్రాంతాలలో వున్న ఎక్కువ గ్రామాలు 1863 వరకు మద్రాసు జిల్లాలో ఉండేవి. పిదప అవి నెల్లూరు జిల్లాలోని గూడూరు తాలుకాకు బదలీ చేయబడ్డాయి. పులికాట్ ప్రాంతం ప్రాచీన చారిత్రక కాలం నుండి జనవాసం కలిగి వర్తక వాణిజ్యాలలో పాల్గొన్నది. సముద్ర గుప్తుని అలహాబాదు శాసనంలో 'పాలక్కడ' 'ఉగ్రసేనుడు' అనే పల్లవ సామంత రాజుని ఓడించినట్లుగా చెప్పబడినది. ఈ పాలక్కడ చారిత్రక కాలంలో ప్రళయ కావేరిగా పిలువబడిన పులికాట్ ప్రాంతమేనని పలువురు చరిత్రకారుల అభిప్రాయం. చోళ, తెలుగు చోళుల కాలంలో కూడా ఈ ప్రాంతం ప్రాముఖ్యతను సంతరించుకున్నది. విజయనగర మహమ్మదీయుల కాలంలో ఇక్కడి నుండి వర్తక, వాణిజ్యాలు జరిగినట్లు ఆధారాలున్నాయి.

1610 సంవత్సరంలో డచ్‌వారు పులికాట్‌లో కోటను నిర్మించుకున్నారు. 1617లో పులికాట్ డచ్ వారి గవర్నర్ పీఠమయ్యింది. తూర్పు కోస్తా తీరంలో వ్యాపారమంతా మల్లయ్య శెట్టి, చిన్నయ్య శెట్టి వ్యాపార సంస్థల ఆధీనంలో వుండేవి. డచ్, ఇంగ్లీషు వ్యాపారులు వీళ్ళ ద్వారానే తమ పెట్టుబడులను పెట్టేవారు. వీరి వ్యాపార కేంద్రం పులికాట్‌లో ఉండేదని బ్రిటీష్ వారి రికార్డుల వల్ల తెలుస్తున్నది. అయితే 17, 18 శతాబ్దాలలో వచ్చిన భయంకర కరువు కాటకాల వల్ల ఉత్పత్తులు పడిపోవడం వల్ల ఇక్కడ వ్యాపారం దెబ్బతిన్నది. డచ్‌వారు ఆర్థికంగా బలహీనులవడం, బ్రిటీష్‌వారు మద్రాసులో తమ స్థావరాన్ని మెరుగు పర్చుకోవడం వల్ల పులికాట్ వ్యాపార కేంద్రంగా ప్రాబల్యం కోల్పోయింది. స్థానిక నాయకులు కొంత చొరవచూపి ముందు చూపుతో బ్రిటీష్ వారిని ఆపినట్లైతే ఈ ప్రదేశం ఎంతో అభివృద్ధి చెంది ఉండేదని డాక్టర్ ఎం. పట్టాభిరామిరెడ్డి అభిప్రాయ పడ్డారు.

ఇవికాక నెల్లూరు తీర ప్రాంతంలో నేను జరిపిన అన్వేషణలో అనెమడుగు, మైపాడు, గవళ్ళపాళెం, వావిలేటిపాడు, గుడిపల్లిపాడు, తూపిలిపాలెం, కోడూరు మొదలగు చోట్ల ప్రాచీన చారిత్రక స్థలాలు కనుగొనబడ్డాయి. ఇందులో మైపాడు, అనెమడుగు, గవళ్ళపాళెం, తూపిలిపాళెం, కోడూరు అనేవి సముద్రానికి అతి చేరువలో ఉండడం వల్ల వాటికి తప్పనిసరిగా సముద్ర వర్తకంతో సంబంధాలు వుండి వుండవచ్చు. పురావస్తు త్రవ్వకాలు మాత్రమే వీటికి సరియైన సమాధానం అందించగలవు.

### ప్రాచీన నాణాలు

చరిత్ర పునర్నిర్మాణానికి నాణాల అధ్యయనం ఎంతైనా అవసరం. భారతదేశ చరిత్రలో శక, యవన, పహ్లవ వంశాల రాజుల గురించే కాక అనేక ఇతర వంశాల తెగల రాజుల చరిత్రలు మనకు ఈ నాణాల వల్ల తెలిశాయి. శాతవాహనుల కాలం నాటి వివరాలు అనేకం మనకు నాణాల ద్వారానే తెలిసింది. నాణాలకు సంబంధించిన ప్రస్తావన ఋగ్వేద కాలం నుండి వుంది. ఈ కాలంలో నిష్క, మానలను ఒక ప్రత్యేక ప్రమాణం కలిగిన విత్తముగా వాడి వున్నట్లు తెలుస్తుంది. క్రీ. పూ. 6వ శతాబ్దంలో అనేక రకాల గుర్తులు కలిగిన వెండి విద్ధాంక నాణాలు వాడుకలో ఉన్నట్లు తెలుస్తుంది. వీటిని శతపథ, తైత్తరీయ, బ్రాహ్మణములలో; పురాణాలలో శతమాన అర్థశతమాన పాతశతమానాలని పిలిచేవారు. కౌటిల్యుని అర్థశాస్త్రంలో, కల్హణుని రాజతరంగిణి బౌద్ధ సాహిత్యంలోనూ కార్షపణము, అర్థకార్షపణము అనే నాణాలే కాకుండా కంస, పాద, మాసక, కాకనిక అనే పేర్లతో నాణాలు చలామణిలో వున్నట్లు తెలుస్తుంది.

నెల్లూరు జిల్లాలో ఇప్పటివరకు నెల్లూరు పట్టణం, దువ్వూరు, అల్లూరు, కొడవలూరు, పడుగుపాడు, కావలి, ఎడవల్లి, కోడూరు గ్రామాలలో నాణాలు విరివిగా దొరికాయి. ఇవి మన నెల్లూరు ప్రాంతంలో జరిగిన రాజకీయ, ఆర్థిక పరిస్థితులను తెలియ జేస్తున్నాయి.



### నెల్లూరు పట్టణం

ఇక్కడ ప్రాచీన చారిత్రక కాలం నాటి నాణాలు దొరికాయి. మొట్టమొదట 1785-86 సంవత్సరాలలో మద్రాసు గవర్నర్‌గా వుండిన అలెగ్జాండర్ డేవిడ్‌సన్ లేఖల వల్ల నెల్లూరు పట్టణ దక్షిణ శివార్లలో రోమన్ చక్రవర్తుల బంగారు నాణాలు దొరికినట్లు తెలిసింది. నెల్లూరు సమీపంలో ఒక రైతు పొలం దున్నుతుండగా ఒక మట్టి ముంతలో రోమన్ చక్రవర్తుల బంగారు నాణాలు దొరికాయి. అందులో 30 నాణాలను అప్పటి నెల్లూరు నవాబు అమీరుల్ ఉమరా సేకరించి, రెండు నాణాలు అంట్రియన్ మరియు ఫెస్టినా అనువాటిని డేవిడ్‌సన్‌కు ఇచ్చినట్లుగా పేర్కొన్నారు. ఇందులో ఒక నాణెం అంటోనియస్ పయస్ ( క్రీ.శ.161) దిగా గుర్తించినారు. ఇవి స్వచ్ఛమైన బంగారంతో చాలా అందంగా తయారు చేసినట్లు తెలియజేశారు. వీటికి సంబంధించిన మిగిలిన వివరాలు తెలియరాలేదు. దీని వలన రోమన్ దేశ వ్యాపారులు నెల్లూరు తీర ప్రాంతంలో సముద్రయానం చేసి వర్తకం జరిపినట్లు తెలియుచున్నది

### వెండి విద్ధాంక నాణాలు

ఈ మధ్యకాలంలో నెల్లూరు పట్టణానికి నైరుతీ దిక్కున ప్రభుత్వ ఆసుపత్రి వెనుక భాగంలో నెల్లూరు చెరువు ఒడ్డున వెండి విద్ధాంక నాణాలు దొరికాయి. శ్రీ పుచ్చల పల్లి రఘురామిరెడ్డి అనే అడ్వకేట్ తన స్వంత భూమిని చదును చేస్తున్నప్పుడు ఒక మట్టి ముంతలో దొరికాయవి. అందులో వెండి నాణాలను చూచిన కూలీలు వాటిని అమ్మివేయడం, కరిగించడం వంటి పనులలో ఉండగా అతికష్టం మీద వాటిలో 5నాణాలను మాత్రం సేకరించగలిగారు.. వాటిని పరిశీలించగా అవి రాగి ముక్కలపై వెండి తాపడం చేసి వున్నాయి. ఇవి చతురస్రందీర్ఘ చతురస్రాకారాలలో వుండినాయి. అంచులు నిర్దిష్టమైన బరువును కలుగ జేయుటకు గాను తెగగొట్టబడి వున్నాయి. ప్రతి నాణెం పైన 5 గుర్తులు వున్నాయి. అందులో సూర్యుడు, షడ్చక్రం, చెట్టు, ఏనుగు, ముఖ్యమైన గుర్తులు. ఇటువంటి నాణాలు దువ్వూరు, అల్లూరు గ్రామాలలో సేకరింపబడ్డాయి. ఈ నాణాలను పరిశీలించిన డాక్టర్ ఇంగువ కార్తికేయ శర్మ ఇవి మౌర్యుల కాలానికి చెందిన నాణాలని ప్రకటించారు. అదే లక్షణాలతో వున్న నెల్లూరులో లభ్యమైన నాణాలు కూడా మౌర్యుల కాలం (క్రీ.పూ 3వ శతాబ్దం). నాటివని గుర్తించడం జరిగింది.

(తరువాయి వచ్చేవారం)

## సినిమా

9 పేజీ తరువాయి

ఒకప్పుడు 'ఒక పాట రాయడానికి మూడు వేల రూపాయల రేటు ఇప్పుడు పది వేల రూపాయలకు పెరిగింది. వంటవాళ్ళకు గతంలో 250 ఇస్తే ఇప్పుడు 500 అయింది. అందరూ రేట్లు పెంచేస్తున్నారు. ఎవ్వరు ఎంత అడిగితే అంతా యివ్వడమే ప్రొడ్యూసర్ల పని. తిరుపతిలో ఇళ్ళు, బంగళాలు ఇది వరకు ఎంతో రీజనబుల్ రేటుకే లభించేవి. ఇప్పుడు విపరీతంగా పెరిగిపోయాయి. చెల్లించక తప్పుతుందా! సినిమా వాళ్ళంటే రేటు ఎంత పెంచినా ఇచ్చేస్తారని ప్రతి వారి అభిప్రాయం'' అన్నారాయన.

### ''కమల్‌హాసన్'' భారతీయుడు

'జెంటిల్‌మెన్, ప్రేమికుడు' చిత్రాల దర్శకుడు శంకర్ టైటిల్స్ కొత్త పంథాలో ఉంటాయనడానికి ఆయన తృతీయ చిత్రం 'భారతీయుడు' కూడా కారణం. ''కమల్‌హాసన్ ద్విపాత్రాభినయం చేస్తారు. మనీషా కోయిరాలా, ఊర్వశి నాయికలు'' అన్నారు ఈ చిత్రాన్ని తెలుగులో నిర్మించే ఎ.ఎం. రత్నం.

### ''ఇండియన్'' డాక్టర్ రాజశేఖర్

డాక్టర్ రాజశేఖర్ నటించే 50 వ చిత్రం ''ఇండియన్''. ఇందులో ఆయన మిలటరీ ఆఫీసర్‌గా నటిస్తున్నాడట. రత్నకుమార్ దర్శకుడు. ఈ చిత్రం తమిళంలో కూడా తయారవుతుంది.

### ''మధ్యతరగతి మహాభారతం''

'కన్నవాళ్ళను కాని వాళ్ళుగా చూసే కొడుకుల కంటే, కంటికి రెప్పల్లా చూసుకునే కూతుళ్లే నయం' అన్నారు భాస్కర్. ఈయన దర్శకత్వంలో తయారవుతున్న ''మధ్యతరగతి మహాభారతం'' చిత్రంలో దాసరి నారాయణ రావు, రాజ్‌కుమార్, సుష్మ, బ్రహ్మానందం, భరణి, మహర్షి రాఘవ, రాళ్ళపల్లి, ఎ.వి.ఎస్, మల్లికార్జున రావు, శివాజీ రావు, చంద్రకాంత్, గుండు హనుమంతరావు, ఐరన్‌లెగ్ శాస్త్రి, లక్ష్మి, లతాశ్రీ, మాధవి లత, రాధాప్రశాంతి తారాగణం. మాటలు: తనికెళ్ళ భరణి, పాటలు: వేటూరి, మల్లెమాల, భాస్కర్. సంగీతం: మాధవపెద్ది సురేష్.

### సెన్సార్ పై సెమినార్

ఆంధ్ర ప్రాంతానికి చెందిన 'సెంట్రల్ బోర్డు ఆఫ్ ఫిలిమ్ సర్టిఫికెట్' సలహా మండలిని ఇటీవల 38 మంది సభ్యులతో పునర్వ్యవస్థీకరించిన సందర్భంగా కేంద్ర బోర్డులో సీనియర్ సభ్యుడు తిక్కవరపు సుబ్బరామి రెడ్డి నూతన మండలి సభ్యులను ఆహ్వానిస్తూ ఒక సమావేశాన్ని ఏర్పాటు చేశారు. ద్వంద్వార్థ సంభాషణలు, హింస, అసభ్యత ఇటీవల చిత్రాలలో మితిమీరుతున్నాయని అందరూ విమర్శిస్తున్నారు. కనుక వాటి విషయంలో తగు జాగ్రత్త వహించాలని ఆయన చెప్పారు. సెన్సార్ అయిన చిత్రాలను సభ్యులు సినిమా థియేటర్లలో చూసేటప్పుడు తొలగించిన భాగాలను మళ్ళీ జోడించినట్లు తెలిస్తే వెంటనే దగ్గర్లో ఉన్న ఏ పోలీసు స్టేషన్‌లో అయినా ఫిర్యాదు చేస్తే తగు చర్య తీసుకోబడుతుందని అన్నారు.

## చిత్రసమీక్ష

9 పేజీ తరువాయి

చేస్తుంది. అగ్రవర్ణ నాయకుడైన కృష్ణమూర్తి; రత్తయ్య జైలుకు వెళ్లగానే దళిత వర్గాన్ని ఊచకోత కోయించి పట్టణమెళ్ళి స్థిరపడి పోతాడు. తన జాతిని ఊచకోత కోయించిన కృష్ణమూర్తి కొడుకు శ్రీధర్‌ను తన కూతురు ప్రేమించడాన్ని రత్తయ్య సహించలేక పోతాడు. కాని శ్రీధర్ ప్రేమలో కాసింత స్వార్థం కూడా లేకపోవడంతో చివరకు కృష్ణమూర్తి - రత్తయ్య కూడా తాత్కాలికంగా తలవంచి అంగీకరించ వలసి వస్తుంది. ఒక ప్రేమ గ్రామాన్ని రెండు వర్గాలుగా చీలిస్తే మరో ప్రేమ గ్రామాన్ని ఒకటిగా చేస్తుంది. ఇది జీర్ణించుకోలేక పాత తరం ప్రతినిధులిద్దరూ ప్రాణాలు కోల్పోతారు.

ఈ విధంగా ప్రాణాలు కోల్పోయే సమయానికి ఇరువర్గాల ప్రతినిధుల్లో ఒకరికి జ్ఞానోదయం కావడం, మరొకరు హృదయం నిండా ద్వేషం నింపుకొని వుంటారు. దీనివల్ల నిస్వార్థ ప్రేమ సాధించిన ఫలితమేమిటో చివరికి తెలక పోవడం లోటుగా కన్పిస్తుంది. చిత్రంలో యువతకు కాసింత పూరట కల్గించే కొన్ని ప్రేమ సన్నివేశాలున్నాయి. ప్రేయసి చెంప చెళ్లు మనిపిస్తే ప్రియుడు బదులుగా ముద్దు పెట్టుకోవడం, ఆ సన్నివేశం ద్వారా మొలకెత్తిన ప్రేమతో ప్రియుడు మానాన్ని కాపాడను తన పైట నివ్వడం హత్తు కుంటాయి. తన ప్రేమకు గుర్తుగా ముద్దును మాత్రమే ఇవ్వమని దానితో మరణాన్ని సైతం సంతోషంగా అంగీకరిస్తానని హీరో అనడం నిస్వార్థ ప్రేమను వెల్లడిస్తుంది.

నటీ నటుల్లో రత్తయ్య పాత్రను దాసరి నారాయణరావు సమర్థవంతంగానే పోషించాడు. ఆయన ధోరణిలో డైలాగులు పల్లించక పోవడం వల్ల ప్రేక్షకులు బ్రతికి పోయారు. ప్రేమికుల పాత్రలో సురభి, హరీష్ రాణించారు. సురభి అందాలకు ఆమెకు వాడిన కాస్ట్యూమ్స్ మరింత వన్నె తెచ్చాయి. ఆమని క్యారెక్టర్ చిత్రంలో చివరికి వెయిట్ లెస్ గా నిలిచింది. హాస్యం కోసం సుధాకర్, ఎవిఎస్, బాబూమోహన్‌లను వాడారు. గోకిన రామారావు మంచి విలనీని అందిస్తున్నా పాపం ఆయనకు అదృష్టం ఎందువల్లో కలిసి రావడంలేదు. పేరుగొప్ప వూరుదిబ్బ సామెత 'కొండపల్లి రత్తయ్య' చిత్రానికి చక్కగా అనువర్తిస్తుంది.

# నూతన వధూవరులకు హార్ధిక శుభాకాంక్షలు

జన్మజన్మల అనుబంధం, మూడు ముళ్ళ బంధం మా అందరి కన్నుల పంటగా ముత్యాల పందిరిలో
ఒక్కటయ్యారు, మీ సంసారం పూలనావలా సాగాలి. మీ జీవితంలో నిత్యం పండు వెన్నెలలు విరియాలి.



వరుడు: చిరంజీవి శ్రీరామ్ వధువు: సౌభాగ్యవతి రాధిక

వధువు పెదనాన్నలు
శ్రీ జక్కా రాధాకృష్ణారెడ్డి
శ్రీ జక్కా కోదండరామిరెడ్డి
చిన్నాన్న
శ్రీ జక్కా శివనారాయణ రెడ్డి



వరుని తండ్రి: శ్రీ సామంతు గోపాలరెడ్డి
తల్లి: శ్రీమతి సామంతు మధుసూదనమ్మ



వరుని పెదనాన్నలు
శ్రీసామంతు రఘురామిరెడ్డి
శ్రీసామంతు సుబ్బారెడ్డి

వధువు తండ్రి: శ్రీ జక్కా శ్రీనివాసులు రెడ్డి
తల్లి: శ్రీమతి జక్కా సౌదామిని



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,